

## సంచికలో




24

1–10–49


# జనత



మార్క్సిస్టు సిద్ధాంత పక్షపత్రిక

| సంచిక 24 | 1—10—1949 | వెల : 8 అణాలు |
| --- | --- | --- |

# మార్క్సిస్టు పార్టీలు:

కమ్యూనిస్టుపార్టీల, వర్కర్సుపార్టీల నాయకత్వాన నూతన ప్రజాతంత్రదేశాల్లోని కార్మిక ప్రజలు సోషలిజానికి రాజకీయార్థిక పునాదులను వేస్తూ ఉన్నారు. ఆ పునాదులు చారిత్రక పరిణామాలను కలిగిస్తున్నాయి. తప్పుడు బూర్జువాప్రపంచ దృక్పథానికి వ్యతిరేకంగా విశాల కార్మిక ప్రజా బాహుళ్యాన్ని సోషలిస్టు విజ్ఞానవంతులుగా చేయడంకోసం సాగించే పోరాటానికీ సోషలిస్టు సమాజాన్ని నిర్మించడానికీ అవినాభావ సంబంధం వుంది.

# సిద్ధాంత కృషి

తమ హక్కులకోసం, శాంతికోసం, స్వాతంత్ర్యంకోసం పెట్టుబడిదారీ దేశాల్లోని కార్మికప్రజలు అప్రతిహతంగా పోరాడుతున్నారు. సైద్ధాంతికంగా కమ్యూనిస్టుపార్టీలెంత బలపడి ఉంటే అంత జయప్రదంగా ఆ పార్టీలు తమ కార్మికవర్గ అగ్రదళపాత్రను నిర్వహిస్తున్నాయి. సిద్ధాంత పోరాటం వర్గపోరాటమే. కాబట్టి సిద్ధాంతరంగంలోకూడా శత్రువుతో నిరంతరపోరాటం కొనసాగించడం అవసరం. సిద్ధాంతరంగంలో శత్రువును లొంగదీయకపోతే బూర్జువావర్గాన్ని ఓడించలేము.

కార్మిక ప్రజాపోరాటం శాస్త్రీయమార్క్సిస్టు-లెనినిస్టు ప్రపంచ దృక్పథంయొక్క అమరజ్యోతిని నిరంతరాయంగా వెలిగించబనవి కాబట్టే

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం, నూతన ప్రజాతంత్ర దేశాల్లోని కమ్యూనిస్టుపార్టీల వర్కర్స్‌పార్టీల బ్రహ్మాండమైన సృజనాత్మకశక్తీ, దోపిడిదారుల సామ్రాజ్యవాదుల పరిపాలనకు వ్యతిరేకంగా పెట్టుబడిదారీ దేశాల్లోని కమ్యూనిస్టులు సాగించిన స్వార్థత్యాగ పూరితమైన పోరాటమూ గొప్పగొప్ప విజయాలను సాధించాయి.

ప్రస్తుతదశలో ప్రాముఖ్యత వహించే అనేక పరిస్థితులు సిద్ధాంత కృషిని ఇంకా తీవ్రతరంచేయవలసిన ఆవశ్యకతను నిరూపిస్తున్నాయి.

ఒకవైపున సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాతంత్రశిబిరం మరో వైపున ప్రజాతంత్ర వ్యతిరేక సామ్రాజ్యవాద శిబిరం – ఈ రెండుశిబిరాలమధ్య జరిగేపోరాటం సిద్ధాంతరంగంలోకూడా తీవ్రతరం అవుతూ ఉంది.

అభివృద్ధినిరోధక సిద్ధాంతాలకూ, రాజకీయాలకూ ఈరోజు అమెరికాయే కేంద్రంగాఉంది. రేడియో సినీమా వగైరా ప్రచార రూపాలను ఉపయోగించి కార్మికప్రజల మనస్సులను "అమెరికన్ నిజం"తో విషపూరితంగా చేయడంలో అమెరికా సామ్రాజ్యవాదులు శక్తివంచనలేకుండా కృషిచేస్తున్నారు. కార్మికప్రజల మనస్సులను గందరగోళ పరచడానికీ, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడే టటువంటి దృఢనిశ్చయంతో పురోగమించకుండా స్తంభింపజేసి వారి ఐక్యతను విచ్ఛిన్నంచేయడానికీ వాళ్ళు ప్రయత్నిస్తున్నారు.

అమెరికన్ "సంస్కృతి" దోపిడి దొంగల సంస్కృతి. అవినీతిని ప్రబోధించే సంస్కృతి. యుద్ధోన్మాద భరితమైన సంస్కృతి. ఇలాంటి ఈ సంస్కృతినే మార్షల్‌ప్లాన్ బానిసత్వానికి గురిజేయబడిన పెట్టుబడిదారీ దేశాల్లో ఎంతోకాలంనుంచి అనేకజాతుల్లో నూతనోత్సాహాన్ని కలిగించినటువంటి ఫ్రాన్సు, ఇటలీలాంటి దేశాల్లో అమెరికన్ సామ్రాజ్యవాదులు ప్రవేశపెడుతున్నారు.

నూతనప్రజాతంత్ర దేశాల్లో ఇదివరకుపూర్వం అధికారంలో ఉన్నటువంటి దోపిడివర్గాలు తామిప్పుడు కోల్పోయిన ఆర్థికరాజకీయ స్థానాలను తిరిగి సాధించడానికి ప్రయత్నిస్తున్నాయి. సైద్ధాంతికంగాకూడా తమ స్థానాన్ని గట్టిపరచుకో జూస్తున్నాయి. అందువల్లనే ఆవర్గాలు

సోషలిజానికీ కార్మికవర్గాధికారానికీ వ్యతిరేకంగా జరిగే పోరాటంలో జాతీయవాదాన్నీ, కాస్మాపోలిటనిజాన్నీ, మతసంస్థల అభివృద్ధినిరోధక ప్రాబల్యాన్నీ, బూజుపట్టిపోయిన బూర్జువా ప్రజాతంత్ర సిద్ధాంతాన్నీ, జాతీయచరిత్రలోనూ, తత్వశాస్త్రంలోనూ రాజకీయార్థిక శాస్త్రం లోనూ ఉన్నటువంటి అభివృద్ధి నిరోధక సిద్ధాంతాలనూ, సాహిత్య కళారంగాల్లో ఫార్మలిజం, స్యరియలిజం (అధివాస్తవికత) లాంటి "సరదా" (ఫ్యాషనబుల్) పద్ధతులనూ విరివిగా ఉపయోగించుకోవా లని ప్రయత్నిస్తున్నాయి.

కార్మికప్రజల నూతన ప్రజాతంత్ర మాతృభూమిని ద్వేషించి పరాజితమైన బూర్జువావర్గం మరో ప్రపంచ యుద్ధాన్ని పురికొల్పే అమెరికా గుత్తవ్యాపారస్థులపై ఆశలుపెట్టుకుంటోంది. అమెరికా గుత్తపెట్టుబడిదారులలో ఈ బూర్జువావర్గంకూడా ఒక భాగస్వామి అవుతోంది. తమతమ దేశాలస్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు బద్ధశత్రువుగా తయారవుతూఉంది.

బూర్జువావర్గం సిద్ధాంతరంగంలో తాను సాగించే ప్రజా వ్యతిరేక పోరాటంలో దోపిడివర్గాల సంస్కృతిని బట్టుకొని ఊగులాడేటటువంటి అభివృద్ధినిరోధకులైన కొందరు మేధావులపై ముఖ్యంగా ఆధార పడుతోంది.

కార్మికవర్గానికీ, ఆ వర్గ సిద్ధాంతానికీ వ్యతిరేకంగా, బూర్జువా వర్గం తాను సాగించే పోరాటంలో ఏ ఒక పద్ధతినీ ఉపయోగించకుండా వదిలిపెట్టడంలేదు. మతసంస్థల అధికారాన్నీ, ఆదర్శవాద తత్వశాస్త్రాన్నీ, పత్రికలనూ, రేడియోలనూ, సాహిత్యాన్నీ, సోషలిజానికి ద్రోహం చేసేవాళ్ళనూ తన ఆశయసిద్ధికోసం ఉపయోగిస్తూ ఉంది. ఫాసిస్టు స్పెయిన్, 'ప్రజాస్వామిక' అమెరికాలాంటి పెట్టుబడిదారీ దేశాల్లో మొత్తం పోలీసుయంత్రాన్ని అంతా కమ్యూనిస్టు సిద్ధాంతాలపై ప్రయోగిస్తూ ఉన్నారు.

మూఢమతవిశ్వాసాలకూ, మధ్యయుగీనభావాలకూ, రాజకీయాభివృద్ధి నిరోధకతత్వానికీ అంతర్జాతీయ కేంద్రమైన వాటికన్ యొక్క అభివృద్ధినిరోధక అధికారవర్గానికి (క్లరికల్ రియాక్షన్

బూర్జువావర్గం కార్మికవర్గ సిద్ధాంతానికి వ్యతిరేకంగా తాను సాగించే పోరాటంలో ఒక ప్రత్యేకపాత్రను సమర్పించింది. దోపిడిదారులయొక్క అధికార ప్రాబల్యాన్ని నిలబెట్టడానికీ, తమ భోగవిలాసమయ జీవితాన్ని కొనసాగించడానికీ అధికారబృందం కార్మికవర్గానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో కేతలిక్ మతపీఠాన్ని ఒక ఆయుధంగా ఉపయోగిస్తూంది. నూతన ప్రజాతంత్రదేశాల్లో అభివృద్ధినిరోధకవర్గం పన్నిన కుట్రలన్నింటిలోనూ, ఆదేశాల్లో ఇదివరకే కూల్చివేయబడిన ప్రజా వ్యతిరేక విద్రోహపాలనను పునరుద్ధరించుటకు చేసిన ప్రయత్నాల్లోనూ, కేతలిక్ మతపీఠాధిపతులకు జోక్యం ఉంది అని నిరూపించబడింది. ఫ్రాన్సు, ఇటలీ, స్పెయిన్, అమెరికా వగైరా దేశాల్లోని అభివృద్ధి నిరోధకుల్లో ఈ మతపీఠాధిపతులుకూడా అగ్రశ్రేణిలోనే ఉన్నారు.

నూతన ప్రజాతంత్రదేశాలు సోషలిజంవైపు పురోగమనంసాగిస్తూ అభివృద్ధి చెందుతూ ఉన్నటువంటి ఈదశలో, పెట్టుబడిదారీదేశాల్లో కమ్యూనిస్టుఉద్యమం అభివృద్ధి చెందుతూ ఉన్నటువంటి ఈ దశలో, బూర్జువా సిద్ధాంతాలకు – ముఖ్యంగా వాల్‌స్ట్రీట్ సిద్ధాంతాలకు వ్యతిరేకంగా నిర్ణయాత్మకమైన పోరాటాన్ని కొనసాగించడం కమ్యూనిస్టుల ప్రధాన కర్తవ్యమై ఉంది.

కమ్యూనిస్టుపార్టీలు సిద్ధాంతరంగంలో శత్రువును ఖచ్చితంగా ఓడించివేసినట్లయితే మార్క్సిస్టు–లెనినిస్టు ప్రపంచ దృక్పథంయొక్క నిర్మలత్వాన్ని తమ కంటిపాపలాగా కాపాడుకుంటాయి. మార్క్సిజం–లెనినిజం అనే అతుకులులేని మహోన్నతమైన భవనంనుంచి వర్గశత్రువుకు ఒక్క ఇటుకబిళ్ళనుకూడా స్వాధీనం గానీయరాదు. సిద్ధాంతాలకులాగే పెడర్థాలన్నిటినీ నిస్సంకోచంగా ప్రతిఘటించితీరాలి. సిద్ధాంతాలకు కల్పించే పెడర్ధాలపట్ల ఉపేక్షాభావంకానీ, ఉదారభావం కానీ వహించడం కమ్యూనిస్టు ఉద్యమానికీ, సోషలిస్టు సమాజ నిర్మాణకృషికీ ఎంతో హాని కలిగిస్తుంది. బూర్జువా జాతీయవాదాన్ని చేపట్టిన టిటోముఠా సోషలిస్టుభూమి అయిన సోవియటుయూనియన్ నాయకత్వాన ఉన్న ప్రజాతంత్ర శిబిరానికి తీరని ద్రోహంచేసి కార్మిక వర్గానికీ, శాంతికీ, అభ్యుదయానికీ, బద్ధశత్రువులైన సామ్రాజ్యవాద

శిబిరంలో దూరింది – మార్క్సిజం – లెనినిజం సిద్ధాంతాన్ని నిరాక రించిన దాని ఫలితం ఇదే.

కమ్యూనిస్టు పార్టీలూ, వర్కర్స్ పార్టీలూ నిర్మాణరీత్యా సిద్ధాంతరీత్యా ఇతోధికంగా అభివృద్ధి చెందాయి. కాబట్టి సామ్రాజ్య వాద సిద్ధాంతానికి వ్యతిరేకంగా మానవజాతి అభివృద్ధిని నిరోధించే సిద్ధాంతానికి వ్యతిరేకంగా, నూతనయుద్ధ ప్రేరేపకులకు వ్యతిరేకంగా, ఇంకా తీవ్రమైనదాడి సాగించడానికి నేడు సంపూర్ణావకాశాలున్నాయి. సిద్ధాంతరంగంలో సాగించే పోరాటంలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ అనుభవం ఎంతో ఉపయోగపడుతుంది. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ తన చరిత్రలో అనేకమంది శత్రువులను తుడిచిపెట్టింది. నేడు సోవియట్ ప్రజలకు కమ్యూనిజంలో తగిన శిక్షణఇస్తూ అంతర్జాతీయ అభివృద్ధినిరోధకవర్గ సిద్ధాంతాలను చీల్చిచెండాడుతూ దెబ్బపై దెబ్బ కొడుతూఉంది.

పెట్టుబడిదారీదేశాల్లో కార్మికవర్గం విజయం సాధించడానికి తగిన భౌతికఅవకాశాలున్న ఈరోజుల్లో నూతనప్రజాతంత్ర దేశాల్లో సోషలిజాన్ని నిర్మించడానికి అనుకూల భౌతికపరిస్థితులున్న ఈరోజుల్లో కమ్యూనిస్టు కేడర్లయొక్క సిద్ధాంతపరిపక్వతపైనా అచంచలదీక్షపైనా విజయం చాలావరకు ఆధారపడి ఉంటుంది.

కాబట్టి కేడర్లకు మార్క్సిజం – లెనినిజంలో శిక్షణఇవ్వడం అన్ని కమ్యూనిస్టుపార్టీలయొక్క వర్కర్స్ పార్టీలయొక్క ప్రముఖ కర్తవ్యం.

నూతన ప్రజాతంత్ర దేశాల్లో కేడర్లకు సిద్ధాంతరంగంలో శిక్షణ ఇచ్చేవిషయంలో ప్రత్యేకశ్రద్ధవహించవలసి ఉంటుంది. ఎందు కంటే అలాంటిశిక్షణలేకుండా నూతన సిద్ధాంతాలను నిర్మించడంలో ఎదుర్కొనే జటిలసమస్యలను పరిష్కరించడం సాధ్యంకాదు. ఈ విష యంలో పార్టీ సాగించే సిద్ధాంతకృషీ, సిద్ధాంత పత్రికలూ అనేకపార్టీ స్కూళ్ళూ, మార్క్సిజం – లెనినిజాన్ని స్వయంగా అధ్యయనం చేయడం, వార్తాపత్రికలూ తదితర పార్టీప్రచారపద్ధతులూ అత్యంత ప్రధానమైన పాత్రను నిర్వహిస్తూఉన్నాయి.

కార్మికవర్గాలనుంచీ, రైతువర్గాలనుంచీ వచ్చినటువంటీ, సోషలిజంపై భక్తిశ్రద్ధలు కలిగినటువంటీ, నూతన మేధావివర్గానికి శిక్షణ ఇవ్వడం చాలా ప్రధానమైన విషయం. నూతన ప్రజాతంత్ర విధానం నూతన జీవితనిర్మాణంలో భాగస్వాములుకావాలని నిజమైన ఉత్సాహాన్ని ప్రదర్శించే అన్నిరకాలైన మేధావులనూ, సోషలిజాన్ని నిర్మించే కృషిలోకి ఆకర్షిస్తూ ఉంది. సోషలిస్టు శిక్షణలో బలమైన సాధనాలుగా ఉపయోగించే సాహిత్యమూ, కళలూ ప్రజాసామాన్యానికి అందుబాటులోకి తీసుకురాబడుతున్నాయి. విధానంలో జాతీయంగానూ, విషయంలో సోషలిస్టుగానూ ఉండేటటువంటి నూతన సంస్కృతిని నిర్మించడంలో ఉపయోగించే సాధనాలన్నిటినీ క్రియారూపంలో అమల్లోకి తెచ్చిన తర్వాతనే కార్మికవర్గం నూతన సిద్ధాంతాన్ని నిర్మించగలుగుతుంది. తద్వారా సోషలిస్టు సమాజనిర్మాణాన్ని ఇతోధికంగా అభివృద్ధిచేస్తుంది.

పరిపాలకయంత్రాన్ని 'హస్తగతం చేసుకున్న కార్మికవర్గం ప్రజల సృజనాత్మక కృషిని ఇదివరకెన్నడూ కనీ వినీ ఎరుగనంతగా అభివృద్ధిపరుస్తుంది. గతకాలం సాధించిన మహత్తర విజయాలపై ఆధారపడినటువంటీ, సోషలిజంకోసం సాగించే మహత్తర పోరాటంలో ప్రజల్లో నూతనోత్సాహాన్ని కలిగించేటటువంటీ నూతన సోషలిస్టు సంస్కృతిని నిర్మిస్తుంది.

నేటి కాలంలో తదితర అన్నివర్గాలకంటె పురోగామివర్గమైన శ్రామికవర్గంయొక్క ప్రయోజనాలను మాత్రమే కాకుండా ఆ వర్గంయొక్క సంస్కృతినికూడా ప్రస్ఫుటం చేసేటటువంటి మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతం సామ్రాజ్యవాదంయొక్క తప్పుడు సంస్కృతికి వ్యతిరేకంగా సోషలిజంయొక్క విజయంకోసం సాగించే పోరాటంలో ఒక అజేయమైన శక్తిగా పనిచేస్తుంది.

—[ "ఫర్ ఏ లాస్టింగ్‌పీస్ ఫర్ ఏ పీపుల్స్ డెమాక్రసీ" 15 జూన్ 1949 ]

# మార్క్సిజానికి శత్రువులు

పి. యూదిన్

బూర్జువా జాతీయ వాదులైనట్టి టిటోముఠాలో కార్డెల్జ్ ఒక సిద్ధాంత వేత్తగా పరిగణించబడుతున్నాడు.

ఈ సంవత్సరం మే 28 వ తేదీన యుగోస్లావ్ స్కుప్ష్టినాలో ప్రజల కమిటీలను గురించి కార్డెల్జ్ ప్రసంగించాడు.

అతని ప్రసంగంలో మనకు ముఖ్యంగా కనిపించేది పెటీబూర్జువా పదాడంబరం. నూతన ప్రజాతంత్రంయొక్క స్వభావాన్ని గురించి అంచనా వేయడంలో తాము (కార్డెల్జ్, టిటోముఠా) ఎన్నడూ పొరపాటు చేయలేదనీ, నూతన ప్రజాతంత్ర విధానంయొక్క అభివృద్ధి క్రమాన్ని గురించి అందరికంటె ముందుగా తామే మార్క్సిస్ట్ పరిశీలన చేయగలిగాం అనీ కోతలుకోశాడు. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ తదితర కమ్యూనిస్టుపార్టీలూ రాజకీయంగా సైద్ధాంతికంగా గందరగోళంలో పడివున్నాయి అని నిందించి తన నిజమైన ట్రాట్స్కీయిస్టు స్వభావాన్ని బైట పెట్టుకున్నాడు. "గందరగోళంగా ఉన్న అలాంటి రాజకీయాలూ సిద్ధాంతాలూ మన దేశంలోగానీమన సాహిత్యంలోగానీ, మన పార్టీపాలసీలోగానీ మీకు కనిపించవు" అనికూడా అతడు ఉద్ఘాటించాడు.

టిటో, కార్డెల్జ్, రాంకోవిక్, జిలాస్‌లను మార్క్సిస్టులని ఎవళ్లూ అనుకోలేదు. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం యొక్క చరిత్రలోగానీ యుగోస్లావియా కమ్యూనిస్టు ఉద్యమంయొక్క చరిత్రలో గానీ, వీళ్లు చూపిన మార్క్సిస్టు ప్రతిభ ఏమీ లేదు.

"మార్క్సిజాన్ని పెంపొందించే" అంతర్జాతీయ ప్రముఖులుగా నటిస్తూ ఉన్న టిటోముఠా యుగోస్లావియా ప్రజలు ప్రదర్శించిన శక్తి సామర్థ్యాలన్నీ తమవే అయినట్లుగా గొప్పలు చెప్పుకుంటూ ఉంది యుగోస్లావియాలో ప్రతిఘటనోద్యమాన్ని తామే నిర్మించామనీ, జాతీయ విముక్తి యుద్ధాన్ని తామే కొనసాగించామనీ, అందువల్ల నిజమైన మార్క్సిస్టులం మేమే అనీ ఈ ముఠా చాటుకుంటూ ఉంది.

ప్రతిఘటనోద్యమానికి కమాండర్ అయినంత మాత్రాన ఆ ఒకేకారణంతో-తాను మార్క్సిస్టునని చెప్పుకోడానికి ఎవరూ సాహసించరు. టిటో ముఠా తాను మార్క్సిస్టు సిద్ధాంతవేత్త అని చెప్పుకోడానికి పైజెప్పిన కారణంకంటె మరే విశేషకారణం లేదు.

పీపుల్స్ ఫ్రంట్ (ప్రజా సంఘటన) కార్యక్రమమే యుగోస్లావియా కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమం అని ప్రకటించిన టిటోను మార్క్సిస్టు అని యెవరు అనుకుంటారు? (ధనిక రైతులూ, చట్టాబేరగాండ్లూ వగైరా) వివిధవర్గాల సమ్మిశ్రణమైన పీపుల్స్ ఫ్రంటే కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమాన్ని నిర్ణయిస్తూ ఉంది. నూతన ప్రజాతంత్రాన్ని గురించి సిద్ధాంతరీత్యా అంచనా వేయడంలో తా మెప్పుడూ గందరగోళం చెందలేదని కార్డేల్జ బడాయిచెప్పుకుంటున్నాడు. నూతన ప్రజాతంత్రం యొక్క స్వభావాన్నిగురించి జాగ్రెబ్‌లో 1946 లో టిటో ఇలా చెప్పాడు:

"మన రాజ్యాంగానికి రైతాంగమే అత్యంత దృఢమైన పునాది. రైతుల వోట్లను సంపాదించుకోడం కోసంగాక నిజంగా రైతాంగమే మన రాజ్యాంగానికి పునాది కాబట్టే మనం రైతులకు ఇలా చెపుతున్నాం."

నూతన ప్రజాతంత్రవిధానంలో ప్రధాన సంచాలకశక్తి శ్రామికవర్గం అనేసూత్రాన్ని నిరాకరించే శుద్ధ సాంఘిక విప్లవవాదుల, (సోషల్ రివల్యూషనరీల) ధనిక రైతు వాచాలత్వం తప్ప ఇది మరేమీగాదు.

పీపుల్స్ ఫ్రంట్, ట్రేడ్‌యూనియన్ల ప్రత్యేకసమావేశాలు జరపడం పూర్తిగా తప్పు అనీ, తెలివితక్కువ అనీ, ట్రేడ్ యూనియన్లను వేరే సమావేశపరచకుండా అందరినీ పీపుల్స్ ఫ్రంట్‌తో పాటే సమావేశపరచవచ్చుననీ నిరూపించడానికి 1947 లో జిలాస్ ప్రయత్నించాడు. కార్మికవర్గ పాత్రను జిలాస్ పూర్తిగా నిర్లక్ష్యంచేసి కార్మికవర్గ ప్రత్యేక సమావేశాలు జరగడం సహించరాని విషయంగా భావిస్తున్నాడు. ధనికరైతులు, చట్టాబేరగాండ్లు వగైరాలందరితో కూడుకొనిన పీపుల్స్ ఫ్రంటు మీటింగులకు వెళ్ళమని సంఘటిత కార్మికులను తరుముతున్నాడు. ఈవిధంగా సంఘటితకార్మికులను పీపుల్స్ ఫ్రంటులో కలిపివేస్తున్నాడు.

విముక్తి పోరాటంలో యుగోస్లావియా కార్మికవర్గం ఎటువంటిపాత్ర నిర్వహించలేదు కాబట్టి యుగోస్లావియా రాజ్యతంత్రంలో కార్మికవర్గం ప్రధానశక్తికాదని మోషేజాదే అనే సిద్ధాంతకర్త గత సంవత్సరం 'బోర్బా' పత్రికలో వ్రాశాడు.

నూతన ప్రజాతంత్ర దేశాలలో కార్మికవర్గనాయకపాత్రను నిరాకరిస్తూ స్కుప్ష్టీనాలో కార్డేల్జ ఇలా ప్రసంగించాడు:

"కార్మికవర్గ నియంతృత్వానికి ఫిలిస్టైయిన్ విశ్వసించినట్లుగా బలప్రయోగం (వైలెన్సు) అవసరంగాదు ..."

శ్రామిక నియంతృత్వానికి బలప్రయోగం అవసరమని ఫిలిస్టైయిన్లు మాత్రమే భావిస్తారనీ, శ్రామిక నియంతృత్వానికి బలప్రయోగం అవసరంలేదనీ కార్డేల్జ అంటున్నాడు. బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా బలప్రయోగం లేకుండానే శ్రామిక నియంతృత్వాన్ని సాధించడమట! కార్డేల్జ పక్కా జాతీయవాది అని ఈ పై విషయమే నిరూపిస్తూ ఉంది.

"యుగోస్లావియా పరిస్థితులకనుగుణంగా ఇదంతా మార్క్సిజాన్ని ఇతోధికంగా అభివృద్ధి చేయడమే" అయినట్లుగా టిటోను అంధప్రాయంగా అనుసరించేవాళ్ళు. దీనిని చిత్రిస్తున్నారు.

ఈ కార్డేల్జలాంటి పెద్దలను దృష్టిలో ఉంచుకునే వి. ఐ. లెనిన్ ఇలా వ్రాశాడు:

"నియంతృత్వంఅనేమాటను నిర్వచించడంలో దాని అసలు

మూల లక్షణాన్ని-విప్లవాత్మక బల ప్రయోగాన్ని - పాఠకుల నుంచి కప్పి పుచ్చాలని తన శక్తికొలదీ కాట్‌స్కీ ప్రయత్నించాడు.''

(23 వ వాల్యూం, 343 వ పేజీ రష్యన్ ఎడిషన్.)

శ్రామిక నియంతృత్వం అంటే బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా బలప్రయోగం మాత్రమే అనే మార్క్సిస్టు వ్యతిరేక భావాన్ని ఖండిస్తూ కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు :

"బలప్రయోగం లేకుండా అసలు నియంతృత్వం అంటూ ఉండదు. అయినప్పటికీ శ్రామిక నియంతృత్వం అంటే వట్టి బలప్రయోగం మాత్రమే కాదు.''

(ప్రాబ్లెమ్స్ అఫ్ లెనినిజం, పేజి 129)

లెనిన్ ఇలా వ్రాశాడు :

"పాత సమాజంయొక్క శక్తులకూ, సాంప్రదాయాలకూ వ్యతిరేకంగా రక్తపాత సహితమూ, రక్తపాత రహితమూ, బలప్రయోగయుతమూ, శాంతి యుతమూ సైనికమూ, ఆర్థికమూ, విద్యాప్రదమూ పరిపాలనా నిర్వాహణమూ అయినటువంటి ఏకదీక్షతో సాగించే పోరాటమే శ్రామిక నియంతృత్వాం"

(25 వ వాల్యూం, 190 వ పేజి, రష్యన్ ఎడిషన్)

సోవియట్ కమ్యూనిస్టు పార్టీకీ, తదితర కమ్యూనిస్టుపార్టీలకూ మార్క్సిజాన్ని స్వయంగా నేర్పబూనుకున్న కార్డెల్జ్ ఎలాంటి మార్క్సిస్టో పై విషయాలనుబట్టి ఇప్పుడు స్పష్టంగా నిర్ణయించుకోవచ్చు. దోపిడిచేసే మైనారిటీని కార్మికవర్గం అణచివేస్తుంది, అనే సూత్రంతో కూడుకొనిన శ్రామిక నియంతృత్వం అనే మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతం కార్డెల్జ్ దృష్టిలో అవసరమైన సిద్ధాంతంగా కనపడకపోవడం సహజమే. ఎందుకంటే అది యుగోస్లావియా బూర్జువా జాతీయ వాదులకు సరిపడదు.

పట్టణాల్లోనూ, పల్లెల్లోనూ వున్న బూర్జువా వర్గానికి అభయహస్తం ఇవ్వడానికీ, కమ్యూనిస్టు వ్యతిరేకి అయిన రాంకోవిక్ పోలీసురాజ్యం సాగించే దారుణ చర్యలన్నీ సోవియట్ యూనియన్‌కు మిత్రులైన కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా మాత్రమే ఉద్దేశించబడ్డాయి అని బూర్జువావర్గం స్పష్టంగా తెలుసుకోడం కోసం శ్రామిక నియంతృత్వం అనే మార్క్సిస్టు సిద్ధాంతాన్ని కార్డెల్జ్ తల్లక్రిందులుజేసి చూపవలసి వుంది.

సోవియట్ యూనియన్‌పై కార్డెల్జ్‌కు అమితమైన ద్వేషం. అతడు సోవియట్ యూనియన్‌కు శత్రువు. ఏకదీక్షతో సాగించిన కృషిఫలితంగా సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు ప్రజాతంత్రం సాధించబడింది అనే విషయాన్ని అంగీకరించ నిరాకరిస్తున్నాడు. "సోషలిస్టు

ప్రజాతంత్ర సూత్రాలను ... సోవియట్ యూనియన్‌లోని సోవియట్ ప్రభుత్వం కూడా పూర్తిగా గ్రహించలేకపోయింది." అని సిగ్గూ బిడియం లేకుండా చెప్తూ తున్నాడు.

యుగోస్లావియాలో టిటోముఠా నెలకొల్పిన కమ్యూనిస్టు వ్యతిరేక, ప్రజాతంత్ర వ్యతిరేక ప్రభుత్వం అత్యున్నతమైన సోషలిస్టు ప్రజాతంత్రాన్ని ప్రతిబింబిస్తూవుంది అని నిరూపించడానికే కార్డెల్జ ఈవిధంగా పెడర్థాలకు పూనుకున్నాడు.

టిటోముఠా తన స్వదేశాంగ నీతిలో పెట్టుబడిదారీ విధానాన్ని పునస్థాపించే పంథా చేపట్టింది. తత్ఫలితంగా ముఖ్యంగా పల్లెప్రాంతాల్లో "ఉత్పత్తిదారుల సహకార సంఘాలు" "పల్లెప్రాంతాల్లో పెట్టుబడిదారీ విధానం ఇంకేంతమాత్రం అభివృద్ధి చెందడంలేదు." అని టిటోముఠా సాగించే నిరంతర ప్రచారం ముసుగులో ధనిక రైతులు తమ స్థానాలను గట్టిపరచుకోవడమూ ఆర్థిక రాజకీయరంగాల్లో ఇంకా బలమైన స్థానాన్ని ఆక్రమించుకోవడమూ త్వరితంగా జరిగిపోతూవుంది.

యుగోస్లావియా ఆర్థిక విధానాన్ని ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులకు లోబడి ఉండేటట్లు చేస్తూ ఆంగ్లో-అమెరికన్ ఆర్థిక పరిధిలోకి యుగోస్లావియాను టిటో ముఠా ఈడ్చివేస్తూఉంది.

స్వదేశాంగ నీతిలోనూ, విదేశాంగ నీతిలోనూ, యుగోస్లావియా ప్రేరేపకులు పూర్తిగా సోవియట్ వ్యతిరేక పాలసీ నవలంబిస్తూ ఉన్నారు. సోవియట్‌పై హిట్లర్ ముఠా ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులూ సాగించిన బూజుబట్టిపోయిన నిందలనే కార్డెల్జ మళ్ళీ తన ప్రసంగంలో ఏకరువు బెట్టాడు. "సోవియట్ సామ్రాజ్యవాదం" అనీ చిన్న జాతులను సోవియట్ యూనియన్ "సమాన దృష్టితో చూడడంలేదు." అనీ రాజకీయంగా ఆర్థికంగా చిన్న జాతుల ప్రయోజనాలను సోవియట్ ప్రయోజనాలకు లొంగి ఉండేటట్లు చేస్తూఉందనీ టిటో ముఠా దుష్ప్రచారం చేస్తూఉంది.

ఒకవైపు ఈవిధంగా సోవియట్‌పై నిందలు వేస్తూనే టిటో ప్రజాతంత్ర వ్యతిరేక ప్రభుత్వం రూపంలో సోవియట్ విధానానికి అన్నిటికంటె ఎక్కువ సన్నిహితమైన ప్రభుత్వం అని కార్డెల్జ ప్రసంగిస్తూ ఉన్నాడు.

సోవియట్ సోషలిస్టు ప్రజాతంత్రాన్ని ఈ విధంగా అపభ్రంశంచేసి, సోవియట్ యూనియన్‌తో నిజమైన మైత్రిని కోరే యుగోస్లావియా ప్రజలను ఈవిధంగా వంచించ ప్రయత్నించడం ఎంత నీచాతినీచమైన విషయం!

కేపిటలిజంనుంచి సోషలిజానికి జరిగే పరివర్తన - అంటే శ్రామిక నియంతృత్వం- వివిధ రాజకీయ రూపాలు తీసుకుంటుంది అనే భావం గతితార్కిక సిద్ధాంతాన్ని అర్థంచేసుకోలేని మార్క్సిస్టు వ్యతిరేక ఆధ్యాత్మికవాది అయిన కార్డెల్జకు అపరిచితమైన విషయం. నూతన ప్రజాతంత్ర శ్రామిక దేశాల్లో నియంతృత్వవిధులు నిర్వహించబడుతున్నాయి అనే విషయాన్ని ఆయన అంగీకరించ నిరాకరిస్తూన్నాడు.

శ్రామికవర్గం యొక్క విప్లవాత్మక సృజనాత్మక శక్తి ఒక అనంతమైనశక్తి అని ఆయన గ్రహించలేడు. ఆయా చారిత్రక పరిస్థితులే కార్మిక వర్గాధికారంయొక్క రాజకీయ సంఘటనలో నూతన రూపాలను అమల్లోకి తేగలుగుతాయి-తెస్తాయి.

మధ్య యూరప్, ఆగ్నేయ యూరప్ దేశాల్లో ఇదేవిధంగా జరిగింది. ఈదేశాల్లో కార్మిక వర్గాధికారం - శ్రామిక వర్గ నియంతృత్వం-సోవియట్ రూపంలో కాకుండా నూతన ప్రజాతంత్ర విధాన రూపంలో అమల్లోకి రావడం సాధ్యమయింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం అంతా అంగీకరించిన చారిత్రిక సత్యమిది.

శ్రామికవర్గ నియంతృత్వం యొక్క సంఘటన రూపం ఖచ్చితంగా ఒకే ఒకటిగా ఉంటుందని లెనిన్ గానీ స్టాలిన్ గానీ ఎక్కడా చెప్పలేదు. అధికారం యొక్క స్వరూపానికి (స్టేట్)రాజ్యాంగయంత్రం యొక్క స్వరూపానికి సంబంధించిన సమస్య అనీ, శ్రామిక నియంతృత్వం ప్యారిస్ కమ్యూన్ రూపంలో చారిత్రకంగా అమల్లోకి వచ్చిందనీ, ఇప్పుడు సోవియట్ల రూపంలో అమల్లోకి వచ్చిందనీ ఇది రాజ్యాంగయంత్రం యొక్క ఒకరూపం -శ్రామికవర్గ నియంతృత్వం - అనీ లెనిన్ పదేపదే నొక్కి చెప్పాడు.

గొప్ప గతితార్కిక శాస్త్రవేత్తలుగా సహేతుకంగా లెనిన్ స్టాలిన్‌లు మాట్లాడతారు. శ్రామిక నియంతృత్వాన్ని కొనసాగించడంలో వారు శ్రామికవర్గ పార్టీలను కాళ్ళూ చేతులు కట్టివేయరు. ప్రస్తుత పరిస్థితుల్లో సోవియట్ యూనియన్‌లో యిదివరకే అమల్లోకివచ్చిన సోవియట్లను శ్రామికవర్గ నియంతృత్వంయొక్క ఒక రూపంగా వారు చూపుతున్నారు. అందువల్లనే సోవియట్లు వివిధ దేశాల కార్మిక వర్గాలన్నిటికి ఆదర్శప్రాయమ్తైనవి. సోవియట్లు ప్రభుత్వాధికారంయొక్క రూపాలు. బూర్జువా వర్గాన్ని కూలద్రోయడానికీ, సోషలిజాన్ని నిర్మించడానికీ ఇలాంటి ప్రభుత్వాధికారంకోరకే ప్రపంచ శ్రామికవర్గమంతా పోరాడవలసి ఉంటుంది.

నూతన ప్రజాతంత్ర దేశాల్లో సోషలిజాన్ని నిర్మించడంలో గడించిన అనుభవమూ, ఈ దేశాల్లో కార్మిక వర్గమే పాలకశక్తిగా ఉండడమూ, కార్మికవర్గం చేతుల్లోనే రాజకీయాధికారం ఉండడమూ, - ఇవి శ్రామిక నియంతృత్వం ఈ దేశాల్లో నూతన ప్రజాతంత్ర రిపబ్లిక్ రూపంలో ఉందిఅనే శాస్త్రీయ సిద్ధాంతాన్ని నిర్వచిస్తూ ఉన్నాయి. ఇది మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతానికి సమకూర్చబడిన నూతన విజ్ఞానం. శ్రామిక నియంతృత్వంపై స్టాలిన్ చేసిన బోధల్లోని ప్రతిభకు ఇదొక నూతన విజయం.

శ్రామికనియంతృత్వానికి సంబంధించిన మార్క్సిస్టు - లెనినిస్టు ఉపదేశాలతో కార్డెల్జ్‌కేమీ ప్రసక్తిలేదు. కార్మికవర్గాధికారంయొక్క నూతన సంఘటనరూపాల్లో అనేక దేశాల్లో శ్రామిక నియంతృత్వం అమలుజరిగిన చారిత్రకానుభవంలో అతని కెట్టి ఆసక్తిలేదు. స్కెడ్రిన్ చిత్రించిన భోగ విలాసమయపాత్రల్లో ఒక పాత్రలాగా "ఇది వుండడానికివీల్లేదు." అంటూ కార్డెల్జ్ ఉద్ఘాటిస్తూ వున్నాడు. అతని 'సైన్సు' దీనితోనే సమాప్తం అవుతూ వుంది.

"సోవియట్ ప్రభుత్వం యొక్క రూపంలోగానీ, నూతన ప్రజాతంత్ర రూపంలోగానీ, శ్రామిక నియంతృత్వం ప్రస్ఫుట మవుతూ వుందనడం తప్పు, అశాస్త్రీయం, మూర్ఖత్వం" అని ఉన్మత్తుడులాగా అతడు కేకలు వేస్తున్నాడు. మార్క్సిజంలో ఓనమాలు తెలియని కార్డెల్జ్ లాంటివాళ్ళు మాత్రమే ఇలాంటి ఉన్మాదంతో వాస్తవానికీ, సామాన్య

జ్ఞానానికీ విరుద్ధంగా అర్థం లేకుండా మాట్లాడతారు.

బూర్జువా జాతీయవాది అయిన టిటో ముఠాకు మార్క్సిజంతో ఎలాంటి సంబంధం లేదని పైవిషయాలే స్పష్టం చేస్తున్నాయి. యుగోస్లావియాలో అనేకమంది కమ్యూనిస్టులను నాశనం చేసినటువంటీ, జైళ్లల్లో కాన్‌సెంట్రేషన్ క్యాంపులో వేలకొలది కమ్యూనిస్టులను నిర్బంధించినటువంటీ వేలకొలది కమ్యూనిస్టులను కాల్చి చంపివేసినటువంటీ, టిటో, రాంకోవిక్ ముఠా ఇంకా ఏముఖంతో మార్క్సిజాన్ని గురించి మాట్లాడుతుంది.

నిన్న మొన్నటిదాకా 'చెట్నిక్స్' ఉత్సాహీలు, ధనికరైతులూ, చట్టావ్యాపారగాండ్లుగా వున్నటువంటి అమాంబాపతును పార్టీలో చేర్చుకొని, రక్తపిపాసి అయిన రాంకోవిక్ కసాయి చేతులో పార్టీని ఒకయంత్రంగా మార్చివేసి కమ్యూనిస్టు మార్క్సిస్టు-లెనినిస్టుపార్టీ సిద్ధాంతాలన్నిటినీ ఈముఠా సర్వనాశనం గావించింది.

"ఫర్ ఏ లాస్టింగ్‌పీస్ ఫర్ ఏ పీపుల్స్ డెమాక్రసీ" 15 జూన్ 1949.

"ప్రతి జాతికి—అది చిన్నదైనా పెద్దదైనా—గుణాత్మకమైన కొన్ని విశిష్ట లక్షణాలుంటాయి. స్వకీయమైన ప్రత్యేక స్వభావం ఉంటుంది. ఆ ప్రత్యేకత ఆ జాతికి మాత్రమే ఉంటుంది. తదితర జాతులకుండదు. ఇదే సోవియట్ ప్రజల అభిప్రాయం. వివిధ జాతుల విశిష్ట లక్షణాలన్నీ కలిసి ప్రపంచ సంస్కృతి యొక్క సమిష్టి విజ్ఞానాన్ని పెంపొందించడానికి తోడ్పడతాయి. ఈ అర్థంలో జాతులన్నీ – చిన్నవీ పెద్దవీ ఒకే సమాన స్థితిలో ఉన్నాయి. ప్రతిజాతి తదితర జాతితో సమానమైనదే."

—స్టాలిన్

# మార్క్సిజం

* లెనిన్

## తాత్త్విక భౌతికవాదం

1844—45 తర్వాత మార్క్స్ భావాలు ఒక ఆకారం పొందాయి. అప్పట్నించీ ఆయన భౌతికవాది. ముఖ్యంగా లడ్విగ్ ఫ్యూయర్‌బాహ్ అనుచరుడు. అయితే ఫ్యూయర్‌బాహ్ భౌతికవాదం ఉండవలసినంత నిశితంగానూ, సమగ్రంగానూ లేకపోవటంలోనే అతని బలహీనత ఉన్నదని మార్క్స్ తర్వాత గ్రహించాడుకూడా. ఫ్యూయర్‌బాహ్ యొక్క చారిత్రక "యుగనిర్మాణం" ప్రాముఖ్యత హెగెలియన్ భావవాదాన్నించి నిశ్చయంగా విడివడుటలోనూ, భౌతికవాదాన్ని ప్రకటించటంలోనూ ఉందని మార్క్స్ భావం. ఈభౌతికవాదం "18 వ శతాబ్దంలో ముఖ్యంగా ఫ్రాన్సులో అప్పుడున్న రాజకీయపక్షాలపైనేగాక... మతంపై, వేదాంతంపై... ఇంకా అన్ని విధాల మెటాఫిజిక్స్‌పై పోరాటం సల్పింది." "నా గతితార్కిక విధానం, హెగెల్ గతితర్కంతో ప్రధానంగా భేదించటమేగాక పూర్తిగా వ్యతిరేకిస్తుంది కూడ. హెగెల్, ఆలోచనాక్రమమే (దీనినే భావము (Idea) అనే పేరిట ఒక ప్రత్యేక పదార్థంగాకూడా మార్చాడు.) వాస్తవమైన విశ్వసృష్టికర్తయనీ, వాస్తవ ప్రపంచం అంటే భావంయొక్క బాహ్య దృశ్య ఘటనారూపం అనీ చెపుతున్నాడు. కాని తద్వ్యతిరేకంగా నాదృష్టిలో భావన అనునది మానవుల మనస్సులచే ప్రతిబింబించబడిన, ఆలోచన అనే రూపములుగా మారినటువంటి భౌతిక ప్రపంచం తప్ప వేరొకటి కాదు" అన్నాడు మార్క్స్. (కాపిటల్ 1 వ వాల్యూం, 2 వ సంపుటికి రచయిత పీఠిక. మార్క్స్ యొక్క ఈ భౌతిక తత్వశాస్త్రంతో సంపూర్ణంగా ఏకీభవించి, ఇంకా పెంపొందిస్తూ ఫ్రెడరిక్ ఏంగెల్సు తన 'డూహ్రింగు ఖండన' (ఈ గ్రంథం వ్రాతప్రతిని మార్క్స్ చదివాడు) అనే పుస్తకంలో ఇలా వ్రాశాడు. "ఈ విశ్వంయొక్క ఏకత్వం దాని ఉనికిలో కాదు ఉంది...నిజమైన విశ్వైక్యత దాని భౌతికత్వంలోనే ఉంది. తత్వశాస్త్ర ప్రకృతిశాస్త్రాల సుదీర్ఘ కష్టయానంలో ఇది ఋజువైంది." "పదార్థపు ఉనికి యొక్క పద్ధతిని సూచించే విధానమే చలనం. చలనంలేని పదార్థం ఎన్నడూ, ఎక్కడాలేదు." "అలాగే పదార్థంలేనిదే చలనంలేదు." అయితే ఆలోచన, చైతన్యం అనేవి ఏమిటి? అవి ఎప్పుడు వచ్చాయి అనే ప్రశ్న రావచ్చు. ఇందుకు సమాధానం ఇది మానవ మేధస్సు యొక్క ఉత్పత్తి అనే సంగతి, పరిసరాలలో, పరిసరాలతోబాటు అభివృద్ధిగాంచిన ప్రకృతి యొక్క ఉత్పత్తే మానవుడు అనే విషయం సువిదితమే. మానవ మేధస్సు యొక్క సృష్టి, కడపటి పరిశీలనలో, ప్రకృతి సృష్టే కాబట్టి, ఆ ప్రకృతితో ఏకీభవించేదే గాని, తక్కిన ప్రకృతికి వైరుధ్యం కాదు

అనేవిషయం స్వప్రమాణం. "హెగెల్ భావవాది. అంటే ఆయన దృష్టిలో మనోభావాలు వాస్తవ విషయాలకూ, పరిణామాలకూ ఏమాత్రం ప్రతిబింబాలు కావు. (ఈ ప్రతిబింబాలు అనే పదం ఒక్కొక్కసారి 'ముద్ర'లు అనే భావంతో వ్రాశాడు ఏంగెల్సు.) తద్విరుద్ధంగా ఆయన దృష్టిలో పదార్ధాలు వాటి అభివృద్ధి — ఈ ప్రపంచానికి పూర్వంనుంచీ ఎక్కడ ఒకచోట అనేది సిద్ధమైయున్న భావంయొక్క ఊహాపోహాలు మాత్రమే." లడ్విగ్ ఫ్యూయర్‌బాహ్ అనే పుస్తకాన్ని ఏంగిల్సు రచించాడు. అందులో తన భావాలనూ. మార్క్సు భావాలనూ ఏంగిల్సు వివరించాడు. ఈ పుస్తకాన్ని అచ్చుకు పంపేముందు తానూ మార్క్సు కలిసి హెగెల్‌పై 1844-45 లో వ్రాసిన పుస్తకం వ్రాతప్రతిని మరొకసారి చదివాడు. ఫ్యూయర్‌బాహ్ - చారిత్రక భౌతికవాదం అనే విషయంపై ఏంగెల్సు ఇలా వ్రాశాడు. "యావత్ తత్వశాస్త్రం యొక్క ముఖ్యంగా ఆధునిక తత్వశాస్త్రం యొక్క అసలు సమస్య — ప్రకృతికీ భావానికి, ఆత్మకూ, ఆలోచనకూ, ఉనికికీ గల సంబంధం...ఆత్మా? ప్రకృతా? ఏదిముందు? ఈ ప్రశ్నకు సమాధానమిచ్చిన తత్వశాస్త్రజ్ఞులు రెండు ముఠాలుగా విడిపోయారు. ప్రకృతికంటె ఆత్మ (Spirit) ప్రధానమని భావించేవారు భావవాదులు, ప్రకృతియే ప్రధానమని భావించేవారు వివిధ రకాలకు చెందిన భౌతికవాదులు."ఇతరత్రా ఏ భావంతో గాని భావవాదం, భౌతికవాదుల పేర్లు ఉచ్చరించటం గందరగోళానికే దారి తీస్తుంది.

మార్క్సు, ఏదో ఒక రూపంలో మతానికి ముడిపెట్టుకునివుండే భావవాదాన్ని మాత్రమే గాకుండా, ఈనాడు బహుళ ప్రచారంలో ఉన్న హ్యూమ్, కాంట్‌ల — పచ్చి భౌతికవాదం (ఎగ్నాస్టిసిజమ్) విమర్శకత్వం (క్రిటిసిజం) అనుకూలత్వం (పోజిటివిజం) మొదలైన వివిధభావాలనూ, అవి భావవాదానికి 'అభివృద్ధి నిరోధక' సమ్మతి తెలియజేసే తత్వశాస్త్రంగా, ఇంకా సరిగ్గా చెప్పాలంటే "భౌతికవాదాన్ని సిగ్గూశరమూ లేకుండా దొంగచాటుగా అంగీకరిస్తూ బాహ్య ప్రపంచంముందు వ్యతిరేకిస్తున్నట్లుగా పరిగణించి తిరస్కరించాడు. 1868 డిశంబరు 12న మార్క్సు ఏంగెల్సుకు వ్రాసిన వుత్తరంలో ప్రఖ్యాత ప్రకృతిశాస్త్రవేత్త థామస్ హక్స్‌లే భాషితాన్ని గురించి వ్రాస్తూ ఇది మామూలుకన్నా 'అధిక భౌతికతత్వం'తో కూడుకున్నదని చెబుతూ "ఎంతకాలం మనం వాస్తవంగా చూస్తూ ఆలోచిస్తూ ఉంటామో అంత కాలం మనం భౌతికవాదంనించి వేరుపడమని" అంటూ హక్స్‌లే ఎగ్నాస్టిసిజానికి హ్యూమిజానికి 'సందు' వదిలాడని విమర్శించాడు. స్వాతంత్ర్యానికీ అవశ్యకతకూ ఉన్న సంబంధాన్ని గూర్చి మార్క్సు అభిప్రాయం తెలుసుకోవటం ప్రత్యేక ప్రాముఖ్యమైన విషయం: "అర్థం కానంత వరకూ ఆవశ్యకత గుడ్డిదే" "ఆవశ్యకతను గుర్తించటమే స్వాతంత్ర్యం (ఏంగెల్సు, డూహ్రింగ్ ఖండన)" అంటే దీని అర్థం, ప్రకృతిలో వస్తునియమాన్ని ఆవశ్యకతనూ గతితార్కికంగా స్వాతంత్ర్యంలోకి మార్పుచెందించటాన్ని గుర్తించటమన్న మాట. మార్క్సు, ఏంగెల్సులు ఫ్యూయర్ బాహ్ భౌతికవాదంతో సహా 'పురాతన

భౌతికవాదంయొక్క ప్రధాన పరిమితులు (ఇంకా ఎక్కువగా బుచనర్ వోట్జ్, మోల్షోల తప్పుడు భౌతికవాదంల) ఈ విధంగా భావించారు: (1) ఈ భౌతిక వాదం "మిక్కిలి అనాలోచితం" రసాయనశాస్త్రం, జీవశాస్త్రాలలోవచ్చిన నూతనాభివృద్ధినిగుర్తించలేనిది. (ఈరోజులలో ఎలక్ట్రిక్ సిద్ధాంతాన్నికూడా అనుబంధించటం అవసరం). (2) పురాతన భౌతికవాదం చారిత్రక, గతితార్కిక దృష్టిలేనిది. (అంటే గతితార్కికానికి వ్యతిరేకార్థం వచ్చే మెటాఫిజికల్ దృష్టి గలది.) అభివృద్ధికి గల కారణాలను చెప్పటంలో అసమగ్రంగానూ, నిలకడ లేకుండానూ ఉన్నటువంటిది. (3) "మానవ అస్తిత్వాన్ని" (స్పష్టంగా నిర్వచించిన చారిత్రక) "సామాజిక సంబంధాల" "మొత్తం"గా చూడక విడమర్చి చూసింది భౌతికవాదం. అందువల్ల ప్రపంచాన్ని 'మార్పు' చేయవలసి ఉండగా 'భాష్యం' చెప్పటం మాత్రమే జరిగింది. అంటే ఈ భౌతికవాదం 'విప్లవకర కార్యాచరణ' ప్రాముఖ్యతను అర్థం చేసుకోలేదన్నమాట.

# గతితర్కం

హెగెల్ గతితర్కం అత్యంత సమగ్రమైనదీ, విజయ పరిజ్ఞానం కలదీ, అభివృద్ధియొక్క అత్యంత గంభీరమైన సిద్ధాంతమూ కాబట్టి అది జర్మన్ ప్రాచీన తత్వశాస్త్రానికి ఒక పెద్దవిజయంగా మార్క్సు ఏంగెల్సులు భావించారు. పరిణామానికీ, అభివృద్ధి సూత్రానికీ సంబంధించిన ఇతర వాదనలన్నింటినీ, విషయ దారిద్ర్యం కలిగి అసమగ్రంగానూ, ప్రకృతీసమాజాల వాస్తవిక అభివృద్ధి మార్గానికి వక్రభాష్యం చెప్పేటట్లుగానూ, వికృతపరిచేటట్లుగానూ ఉన్నాయని మార్క్సు ఏంగెల్సులు పరిగణించారు. (ఈ అభివృద్ధి తరచుగా ఉద్భృతంగానూ, విపత్కరంగానూ, విప్లవయుతంగానూ ఉంటుంది.) "చైతన్యయుత గతితర్కాన్ని హెగెల్ తత్వాంతో సహా భావవాదంయొక్క బారినుంచి కాపాడి దానిని ప్రాకృత భౌతికవాద దృక్పథంతో అన్వయింపజేసింది నేనూ, మార్క్సు మాత్రమే...గతితర్కానికి ప్రకృతి పరీక్ష. ఆధునిక ప్రకృతిశాస్త్రం ఈ పరీక్షకు కావలసిన, దిన దినాభివృద్ధిపొందే అనేక వస్తుసముదాయాన్ని సమర్పిస్తున్నదని చెప్పాల్సియుంది. (ఇది రేడియం, ఎలక్ట్రానులు మూలపదార్థాల పరస్పరం మార్పును పరిశోధించక పూర్వం వ్రాయబడింది.) ఈ విధంగా తుదివివరణ తీవ్ర ప్రకృతి గమనం గతి తర్కమేనని మెటాఫిజికల్ కాదని నిరూపించింది." అన్నాడు ఏంగెల్సు.

"ప్రపంచం కొన్ని తయారీ వస్తువుల సముచ్చయంగా గాక, గమనంయొక్క మొత్తంగా భావించాలి. మన మనసుపై వస్తువుల ప్రతిబింబాలు ఎంత నిలకడగా ఉంటాయో ఈ గమనంలో వస్తువుల నిలకడ అలా వుంటుంది. మన భావాలు అస్తిత్వంలోకి వస్తూ పోతూ నిరంతరం మారుతూవుంటాయి. హెగెల్ కాలం నుంచీ ఈ దివ్యసిద్ధాంతం సాధారణ చైతన్యంలో ఎంతగా చొచ్చుకుపోయిందంటే ఈ సిద్ధాంతాన్ని ఖండించటమే అరుదై

పోయింది. అయితే ఈప్రధానసిద్ధాంతాన్ని మాటల్లో ఆమోదించటం, దాన్ని ప్రతి చిన్నవిషయానికీ వాస్తవంగా అమలుజరపటం ఈరెండూ రెండువిభిన్నవిషయాలు." "గతి తార్కిక సిద్ధాంతానికి అంతంగాని, సంపూర్ణం కావటంగాని, పవిత్రమైనవి అంటూగాని ఏమీలేవు. అది ప్రతివస్తువు యొక్కా, ప్రతి వస్తువులోనీ మార్పొందే లక్షణాన్ని తేటతెల్లంచేస్తుంది. తగ్గుస్థాయినించి ఉచ్ఛస్థితికి అంతంలోని ఆరోహణ తప్ప, అస్తిత్వంలోకి వస్తూ పోతూ వుండే క్రమం తప్ప, మరేదీ దీనిముందు నిలవజాలదు. గతి తార్కికతత్వం సైతం|మనస్సులోని ఈక్రమంయొక్క ప్రతిబింబం తప్ప మరొకటిలేదు." మార్క్సు ఉద్దేశం ప్రకారం "భౌతిక ప్రపంచయొక్కా, మానవాలోచన యొక్కా, సాధారణ చలనసూత్రాల శాస్త్రమే గతితర్కం;"

హెగెల్ తత్వశాస్త్రంలోని విప్లవకర పక్షాన్ని మార్క్సు అవలంభించి అభివృద్ధి చేశాడు. గతితార్కిక భౌతికవాదం ఇతిరశాస్త్రాల కతీతంగా ఉండే ఎట్టి తత్వశాస్త్రాన్నీ కోరదు. మొదటి తత్వ శాస్త్రానికి "ఆలోచనాశాస్త్రం, దాని నియమాలు, పూర్వతర్కం, గతితర్కం" మిగిలాయి. హెగెల్‌తో సమర్థించబడి మార్క్సుచేత అర్థం చేసుకోబడిన గతి తర్కం, ఎపిస్టిమోలజీ లేక వైజ్ఞానిక సిద్ధాంతం అని పిలువబడే తత్వశాస్త్రంతో కూడుకొని వున్నది. విజ్ఞానంయొక్క పుట్టుకా పెరుగుదలలనుగురించీ, అజ్ఞానం నుంచీ, విజ్ఞానానికి జరిగిన పరిణామం, వీటిల్లోని విషయపదార్థాన్నికూడా చారిత్రికంగా పరిగణించాల్సి యుంటుంది.

ప్రస్తుతం అభివృద్ధి, పరిణామం అనే భావాలు సామాజిక చైతన్యం మొత్తంలో చొచ్చుకుపోయాయి. ఐతే ఈ భావాలు హెగెలియన్ వేదాంతమార్గానికి భిన్నమైనవి. పరిణామాన్ని గురించి ప్రస్తుతమున్న భావంకన్నా హెగెల్ పునాదులపై మార్క్సు ఏంగెల్సులు సిద్ధాంతీకరించినభావం, ఇంతకన్నా సమగ్రంగానూ సమృద్ధిగానూ వుంటుంది. అభివృద్ధి గతించిన దశలను పునశ్చరణ చేస్తున్నట్లు కనిపిస్తుంది గాని వాటిని మరింత వున్నత స్థితిలో పునశ్చరణ చేస్తుంది. ("అభావము అభావముపొందుట లేక వ్యతిరేకతకు వ్యతిరేకత") కాబట్టి అభివృద్ధి సరళ రేఖ వంటిదిగాదు. ఒక స్ప్రింగ్ లాంటిది. అభివృద్ధి (గంతులువేస్తూ) దాట్లుగానూ, విపత్కరంగానూ, విప్లవకరంగానువుంటుంది; "అభివృద్ధిలో అవాంతరాలు" పరిణామం గుణంగా మారటం; అభివృద్ధికి అంతర్గత వేగం, ఒక నిర్దిష్ట వస్తువుపై వివిధశక్తుల ధోరణుల, వైరుధ్య అసంగత ప్రభావం పడుట లేక ఒక నిర్దిష్ట విషయములో గాని; ఒక నిర్దిష్ట సమాజంలోగాని ఉన్న అభివృద్ధియొక్క అంతర్గతవేగం; - గోచరమయ్యే ప్రతి వస్తువుయొక్క పరస్పరాధార సామాన్య, సర్వపక్షు, నిరవరోధ సంబంధం, (చరిత్ర కొత్తపుంతలను నిశ్చయంగా బహిరంగ పరచినప్పుడు) ఏక నియమబద్ధం చేసే చలనంయొక్క విశ్వగమనం - ఈ విధమైన గతితార్కిక లక్షణాలు మామూలు అభివృద్ధి సిద్ధాంతం కన్నా విశేషమైనవి.. (మార్క్సు 1868 జనవరి 8 న ఏంగెల్సుకు వ్రాసిన ఉత్తరంలో స్టెయిన్ యొక్క కలపత్రిభాగ విభజనను (Wooden trichotom - wo) భౌతికవాద గతితర్కంతోపోల్చి కంగారు పడటం యెంత హాస్యాస్పదమో వివరించాడు.)

# ప్యారిస్ కమ్యూన్: శ్రామిక నియంతృత్వం

*


ఎటీన్ ఫాజన్

(ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ పొలిటికల్ బ్యూరో సభ్యుడు)


ప్యారిస్‌లో 1871 మార్చి 18 వ తేదీన కార్మికవర్గమూ నేషనల్ గార్డూ కమ్యూన్‌ను ప్రకటించాయి. అప్పుడు ప్రష్యన్ సైన్యం ఆపట్టణాన్ని ముట్టడించి ఉంది.

ఫ్రెంచి జాతీయ స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవాలనే ప్రబల కాంక్ష ప్యారిస్ ప్రజల్లో ప్రజ్వలిస్తూ ఉండడం చేత వారు తమ శత్రువుకు లొంగి అస్త్రసన్యాసంచేయ నిరాకరించారు. మరునాడు, థెయిర్స్ ప్రభుత్వం శత్రువుతో శాంతి ఒడంబడిక చేసుకుంది. ఈ థెయిర్స్ ప్రభుత్వాన్నే బిస్మార్క్ దయాదాక్షిణ్యాలమీద ఆధారపడిన ప్రభుత్వం అని మార్క్స్ అన్నాడు. బిస్మార్క్ ఆజ్ఞలను శిరసావహించిన థెయిర్స్ నేషనల్ గార్డు యొక్క ఆయుధాలను వశపరచుకోవాలని ప్రయత్నించారు. ఈ ద్రోహచర్యకు ఫ్రెంచి ప్రజలు తిరుగుబాటుతో సామాధానం ఇచ్చారు.

ప్యారిస్ కమ్యూన్ స్వల్పకాలం మాత్రమే జీవించింది. అయినప్పటికీ ఇందువల్ల ప్యారిస్ కార్మికులు సాగించిన పోరాటం యొక్క ప్రత్యేక ప్రాముఖ్యతకు ఏమీ లోటు వాటిల్లదు. జెనీవాలో 1908 మార్చి 18 వ తేదీన లెనిన్ ప్రసంగిస్తూ సోషలిస్టు విప్లవ సమస్యలను విస్పష్టంగా ఎలా చిత్రించవలెనో యూరోపియన్ శ్రామికవర్గానికి కమ్యూన్ బోధించింది అని చెప్పాడు.

* * *

1871 మార్చి 18 సంఘటనల ద్వారా ప్రభుత్వాధికారం నేషనల్ గార్డు చేతుల్లోకి, ప్యారిస్ కార్మికవర్గమూ, ఆ వర్గానికి మిత్రుడు అయిన పెటీబూర్జువావర్గం యొక్క చేతుల్లోకి వచ్చింది.

ప్రభుత్వమూ, బూర్జువా రాజకీయవేత్తలూ ప్యారిస్‌నుంచి వెర్సలీస్‌కు పలాయనం చిత్తగించారు. కమ్యూన్‌కు వ్యతిరేకంగా పోరాటం జరపడానికి వాళ్ళు తమతోపాటు తమ ప్రభుత్వయంత్రాన్ని కూడా తరలించుకొనివెళ్ళారు. అందువల్ల కమ్యూన్ ఏర్పడిన మొట్టమొదటి రోజులనుంచీ దోపిడి ముఠా యొక్క ప్రతిఘటనను ఒకవర్గంగా బలప్రయోగంతో తుడిచిపెట్టి వేయవలసిన

అవసరాన్ని కమ్యూన్ ఎదుర్కోవలసి వచ్చింది. శ్రామిక నియంతృత్వం నిర్వహించవలసిన విధుల్లో ఇది మొట్టమొదటిది. ఇది శ్రామిక నియంతృత్వం యొక్క స్వాభావిక లక్షణం.

ఈ కర్తవ్యాన్ని కమ్యూన్ పూర్తి చేయలేకపోయినప్పటికీ కమ్యూన్ నూతన సంస్థలను ప్రారంభించవలసి వచ్చింది. పెట్టుబడిదారీవర్గం తన అధికారాన్ని పునస్థాపించుకోకుండా ఆ వర్గాన్ని అణచివేయడానికి అవసరమైన ఆయుధాలను ఉత్పత్తి చేయవలసివచ్చింది. కొన్ని వారాల్లోనే కమ్యూన్ ఒక కొత్తరకపు రాజ్యాంగయంత్రాన్ని నిర్మించుకుంది.

ఈరాజ్యాంగయంత్రంయొక్క ప్రధాన లక్షణాలేమిటి? ఈ ప్రభుత్వం ప్రజలను సాయుధులుగా జేసింది. బూర్జువావర్గ ప్రయోజనాలకోసం పనిచేసిన పై తరగతులనుంచి వచ్చిన సైన్యం యొక్క స్థానంలో సాయుధప్రజలే నిలబడ్డారు. నిరంకుశ పోలీసు పరిపాలక శాఖలకు బదులుగా ప్రజాప్రతినిధులతో ప్రజాతంత్ర శాఖలు నెలకొన్నాయి. ఈ ప్రజా ప్రతినిధులు తరితర కార్మికుల జీతాలకు సమానంగా మాత్రమే జీతాలు తీసుకుంటూ ఉండేవారు. మేజిస్ట్రేట్లనూ, జడ్జీలనూ ప్రజలే ఎన్నుకొనే విధానాన్ని కమ్యూన్ ప్రవేశపెట్టింది. తుదకు బూర్జువా పార్లమెంటునుకూడా రద్దుజేసి ప్రభుత్వాధికారం కమ్యూన్‌కే కేంద్రీకరించింది. గాలితిత్తుల కబుర్లపోగుల సభలాగా కాకుండా ఇదే నిజమైన అసెంబ్లీలాగా వ్యవహరించింది. శాసనసభ (లెజిస్లేటివ్ అసెంబ్లీ) కార్య నిర్వాహకసభ (ఎగ్జిక్యూటివ్ అసెంబ్లీ) రెంటికి ప్రజాప్రతినిధులే ప్రాతినిధ్యం వహించారు. ఈ ప్రతినిధులు తమనెన్నుకొన్న వోటర్లకు బాధ్యులు. తాము ఎన్నుకొన్న ప్రతినిధి సరిగా పనిచేయడం లేదని అసంతృప్తి కలిగితే ప్రజలే వారి ప్రాతినిధ్యాన్ని రద్దు చేసివేస్తారు. కమ్యూన్‌లన్నీ కలిసి ఎన్నుకున్న జాతీయ ప్రతినిధులతో నేషనల్ కమ్యూన్ ఏర్పడే విధానంకూడా ప్రతిపాదించబడింది.

ప్యారిస్ కమ్యూన్ స్వల్పకాలమే జీవించి వుండటంవల్ల అది తనకాలాన్ని ఎక్కువగా ఆత్మరక్షణకే వినియోగించవలసివచ్చింది. సాంఘిక రంగంలో మాత్రమే ప్యారిస్ కమ్యూన్ తన కృషిని ప్రారంభించగలిగింది. కాని ఈ రంగంలో అది చేసిన నిర్ణయాలే దాని శ్రామికవర్గ ప్రజాతంత్ర స్వభావంయొక్క ప్రాముఖ్యతను తెలియజేస్తున్నాయి. పెట్టుబడిదారులు మూసివేసిన, విడిచిపెట్టిన పరిశ్రమలను కార్మికసంఘాలకు స్వాధీనం జేయాలని ఉత్తరువు జారీచేసింది. జరిమానాలు విధించే పద్ధతిని రద్దుచేసింది. యుద్ధకాలంకోసం వసూలుజేసే పన్నులను రద్దుజేసింది. ప్రభుత్వంనుంచి చర్చిని, (మతసంస్థలను) చర్చినుంచి స్కూళ్ళను వేరుచేసింది.

నిజానికి నామమాత్రమైన బూర్జువా ప్రజాతంత్రాన్నే రద్దుజేసి ఆస్థానంలో శ్రామిక ప్రజాతంత్రాన్ని నెలకొల్ప సాగింది.

చరిత్రలో అపూర్వమైన రిపబ్లిక్‌ను — కార్మికవర్గం నాయకపాత్రను నిర్వహించే ప్రజాతంత్ర రిపబ్లిక్‌ను — నెలకొల్పింది. కేపిటలిజంనుంచి సోషలిజానికి పరివర్తన జరిగే సమయంలో సాధ్యమైన ఏకైక పంథా శ్రామిక నియంతృత్వమే అనేటటువంటి మార్క్సిస్టు సిద్ధాంతాన్ని చరిత్రలో

మొట్ట మొదటిసారిగా అనుభవంలోకి తెచ్చింది.

కమ్యూన్ యింకా సజీవంగా వున్న సమయంలో, 1871 ఏప్రిల్ 12 వ తేదీన మార్క్స్ కమ్యూన్ యొక్క గుణపాఠాలను ఆధారంగా చేసుకొని కుగెల్ మన్ కు వ్రాసిన ఉత్తరంలో సోషలిస్టు విప్లవం అంటే కేవలం "నిరంకుశ మిలటరీ యంత్రాన్ని పూర్వంలాగా ఒక చేతినుంచి మరోచేతికి మార్చడం" కాదనీ "దాన్ని ధ్వంసంచేసి తీరాలి" అనీ సిద్ధాంతీకరణ చేశాడు.

కమ్యూన్ తదనంతరం 1872 జూన్ లో, కమ్యూనిస్టు మానిఫెస్టో కార్యక్రమం కొన్ని విషయాల్లో ప్రస్తుత కాలానికి దూరమైపోయింది అనీ, కమ్యూన్ నేర్పిన గుణపాఠాల ఆధారంపై దానిని యింకా ఎక్కువ పటిష్ఠంగా చేయాలనీ మార్క్స్ ఎంగిల్సులు ప్రకటించారు

"ఫ్రాన్సులో అంతర్యుద్ధం" అనే మార్క్స్ పుస్తకానికి (తృతీయముద్రణకు) పీఠిక వ్రాస్తూ ఎంగిల్స్ యిలా వ్రాశాడు:

"శ్రామిక నియంతృత్వం అనే మాట చెవిన బడగానే జర్మన్ ఫిలిస్టెయిన్లు భయ భీతులై పోతూ ఉన్నారు శ్రామిక నియంతృత్వం అంటే భయపడిపోయే ఓ పెద్దలారా, శ్రామిక నియంతృత్వం అంటే ఏమిటో, ఎలా ఉంటుందో చూడదలచుకుంటే, ప్యారిస్ కమ్యూన్ ను చూడండి. శ్రామిక నియంతృత్వం అంటే అదే."

ప్యారిస్ కమ్యూన్ మొట్టమొదటిది మాత్రమే. అది శ్రామిక నియంతృత్వం యొక్క క్రింది మెట్టుకు సంబంధించిన రూపం. తదనంతరం సోవియట్ యూనియన్ లో పూర్తిచేయబడిన ఆ కృషికి - రేపు సర్వత్ర సాధించబడబోయే ఆ కృషికి - ఒక అస్పష్ట చిత్రాన్ని (రఫ్ ఔట్ లైన్) మాత్రమే మహనీయులైన ఆ కమ్యూనార్డ్స్ ఆనాడు ఊహించ గలగారు.

మొదటిది, సామ్రాజ్యవాదం ఇంకా పాతిక సంవత్సరాలకుగాని ఒక స్పష్టమైన రూపం తీసుకోజాలనటువంటి ఆనాడు, ఫ్రాన్సు లాంటి దేశంలో సోషలిస్టు విప్లవం జయించాలంటే అందుకు ఒకానొక స్థాయివరకు ఉత్పత్తి శక్తులు అభివృద్ధిచెంది ఉండడం, పరిశ్రమలూ కార్మికవర్గం కేంద్రీకృతమై ఉండడం, అవసరం అవుతుంది. కాని కమ్యూన్ రోజుల్లో ఇంకా ఆ పర్థితులు ఏర్పడలేదు.

రెండవది, మార్చి 18 తిరుగుబాటు ఆనాటి పరిస్థితుల ఫలితమే. అప్రయత్నంగా ప్రజలు తమంతటతాము తీసుకొన్న చొరవమాత్రమే. ముందుగానే తగిన సన్నాహాలన్నీ పూర్తి చేసుకొని ఒక క్రమబద్ధపద్ధతి ప్రకారం దానిని నడపడం జరగలేదు. నిజమైన మార్క్సిస్టు పార్టీచే ఆనాడు ఫ్రెంచి కార్మికవర్గం నడపబడలేదు. ఆరోజుల్లో అది సాధ్యం కాదు కూడా. అయినప్పటికీ ప్రజా సామాన్యం యొక్క ప్రతిభాపూర్వకమైన చొరవఫలితంగా కమ్యూన్ చిరస్మరణీయమైన కృషిని నిర్మించింది. కాని ఇంతటి మహత్తరకృషిని నిర్మించిన వారికే ఇదెంత ప్రాముఖ్యమైన విషయమో, ఇది ఎంతటి

మహోన్నత భవిష్యత్తుకు దారితీస్తుందో ఒక స్పష్టమైన అభిప్రాయం లేదు. వారిలో విప్లవసిద్ధాంతం లోపించిఉంది. విప్లవ సిద్ధాంతం లేకుండా నిజమైన విప్లవోద్యమం అంటూ ఉండదు.

ఈ పై జెప్పిన కారణాలవల్ల ప్రధాన లోపాలు జరిగాయి. తత్ఫలితంగా ఓటమి సంభవించింది. పీడించేవర్గాలను తొలగించడం ఉత్పత్తి సాధనాలను సంఘపరం చేయడం అనే ప్రాతిపదికమీద సోషలిజం కోసం సాగించే పోరాటంలోనే శ్రామిక వర్గ ప్రభుత్వం తనను బలపరచుకుంటుంది. కాని కమ్యూన్ అలాంటి పోరాటాన్ని సాగించలేదు. బ్యాంకులను స్వాధీనపరచుకోలేదు. వర్సైలీస్‌లో తిష్టవేసినవాళ్లకు వ్యతిరేకంగా తన ఆత్మరక్షణకు సంబంధించిన మేరకే అదివర్గపోరాటం జరిపింది. కాని అలాకాకుండా వెంటనే తనపై శత్రువు దెబ్బకొట్టేదాకా వేచివుండకుండానే, శత్రువు తిరిగి తనశక్తులను సంఘటితపరచుకోకపూర్వమే, శత్రువుపై ముందే ఖచ్చితంగా దాడి జరపవలసింది.

మూడవది, కష్టజీవులైన తదితర ప్రజా సామాన్యంతో ముఖ్యంగా రైతాంగంతో కార్మికవర్గం సమ్మేళనమేర్పరచుకొని, కార్మికవర్గం నాయకపాత్ర నిర్వహించినప్పుడే శ్రామికనియంతృత్వంజయప్రదంఅవుతుంది.

రైతు ప్రజాబాహుళ్యంతో సమ్మేళనమేర్పరచుకోడానికి కమ్యూన్ ప్రయత్నించింది. కాని ప్యారిస్‌దిగ్బంధన, అభివృద్ధి నిరోధకులు సాగించే దుష్ప్రచారమూ కమ్యూన్‌ను రైతాంగంతో సంబంధం పెట్టుకోకుండా వేరుచేశాయి.

* * *

కమ్యూన్‌యొక్క ఆశయాన్ని 1871లో రక్తపాతంలో ముంచెత్తినా తర్వాత 46 సంవత్సరాలకు నవంబరు విప్లవంతో కార్మికవర్గం విజయాన్ని సాధించింది. మానవజాతి చరిత్రలో నవంబరు విప్లవం ఒక నూతన యుగాన్ని - సోషలిస్టు యుగాన్ని - ప్రారంభించింది.

ప్యారిస్ కమ్యూన్ ప్రారంభించిన కృషిని నూతన పరిస్థితుల్లో, మొత్తం ప్రపంచంలోని ఆరోవంతు భూభాగంలో విజయవంతంగా ఇంకా ముందుకు కొనసాగించిన ఫలితమే నవంబరు విప్లవం.

కార్మికవర్గ నాయకత్వాన నవంబరు విప్లవం కొనసాగించబడింది. తన విధిని నెరవేర్చడానికి నిర్మాణ రీత్యా సిద్ధాంత రీత్యా అవసరమైన సన్నాహంఅంతా నవంబరు విప్లవం ముందుగానే పూర్తి చేసుకుంది. కష్టజీవులైన రైతాంగంతో సన్నిహిత సంబంధం ఏర్పరచుకుంది. ఒక కొత్తరకపు కార్మికవర్గ పార్టీచే- బ్రహ్మాండమైన వర్గ పోరాటాల్లో కాకలు తీరిన మార్క్సిస్టు పార్టీచే-లెనిన్ స్టాలిన్‌ల నవంబరు విప్లవం నడపబడింది. కమ్యూన్ నాడు ఇలాంటి పరిస్థితులులేవు.

కమ్యూన్ గుణపాఠాల చేతనూ 1905 ప్రథమ రష్యన్ విప్లవం బోధించిన గుణపాఠాలచేతనూ, నడపబడిన 1917 ఫిబ్రవరి నుంచి 'కార్మికుల, సైనికుల సోవియట్ల'పై స్వయంగా ఆధారపడిన బోల్షివిక్కులు సోవియట్ ప్రభుత్వాన్ని- శ్రామిక నియంతృత్వం యొక్క అత్యున్నత స్వరూపాన్ని - నిర్మించారు.

"లెనినిజం మూలసూత్రాలు" అనే తన పుస్తకంలో కామ్రేడ్ స్టాలిన్ ఇలా వ్రాస్తున్నాడు:

"ఎంతోకాలంనుంచి అన్వేషించి చివరకు కనిపెట్టిన రాజ

కీయ రూపమే సోవియట్ రిపబ్లిక్. ఈ రాజకీయ రూపం యొక్క చట్రంలోనే ఆర్థిక దాస్యంనుంచి శ్రామికవర్గానికి సంపూర్ణ విముక్తి లభిస్తుంది. సోషలిజం సంపూర్ణంగా విజయం పొందుతుంది.

"ఈ రాజకీయ రూపానికి ప్యారిస్ కమ్యూన్ పిండం లాంటిది. దాని అభివృద్ధియే, దాని సంపూర్ణ వికాసమే సోవియట్ ప్రభుత్వం."

కమ్యూన్ సాధించజాలనటువంటి, సాధించడానికి ప్రయత్నమైనా చేయనటువంటి కర్తవ్యాలను సోవియట్ యూనియన్ పూర్తిచేసింది. పెట్టుబడిదారీ విధానాన్ని కూకటివ్రేళ్ళతో పెకలించివేసింది. ఒకమనిషిని మరోమనిషి దోచుకోడాన్ని నిర్మూలించివేసింది. జాతీయ ఆర్థికసంపద, సోషలిజంయొక్క ప్రాతిపదికపై కార్మిక ప్రజల సౌభాగ్యమూ త్వరితంగా అభివృద్ధి చెందడానికి గ్యారంటీ కలగజేసింది. ప్రజాతంత్రవిధానాన్ని అత్యున్నతస్థాయికి కొనిపోయింది. సోవియట్ ప్రజల్లో నైతిక, రాజకీయైక్యతను సాధించింది. నూతన మానవుని - సోషలిస్టు మానవుని - సృష్టించడంకోసం, సైన్సును, టెక్నిక్‌నూ, సంస్కృతినీ పెంపొందించడం కోసం సంపూర్ణావకాశాలను కల్పించింది.

సోవియట్ యూనియన్ సోషలిజాన్ని నిర్మించింది. కమ్యూనిజానికిక్రమంగా మారడానికి అవసరమైనపరిస్థితులనుకలిగించింది.

సోవియట్ యూనియన్, అది సాధించిన విజయాల, దానిశక్తి సామర్థ్యాల పుణ్యమాఅంటూ ఇతర దేశాలు నేడు అంతకంటె తక్కువ కఠినమైన పరిస్థితుల్లోనే విభిన్నరూపాల్లో కేపిటలిజంనుంచి సోషలిజానికి పురోగమించగలవు. కొన్ని సందర్భాలలో సోవియట్ విధానంతో కాకుండా నూతన ప్రజాతంత్ర పరిపాలన ద్వారా అవి సోషలిజానికి పరివర్తన చెందగలవు. అయితే ఆదేశాలు సోవియట్ యూనియన్‌నుంచి లభించే స్పష్టమైన సహకారం మీద ఆధారపడినప్పుడే ఇది సాధ్యమవుతుంది. నూతన చారిత్రక పరిస్థితుల్లో నూతన ప్రజాతంత్ర విధానంకూడా శ్రామికనియంతృత్వకర్తవ్యాలనుముఖ్యంగా పెట్టుబడిదారీ శక్తులను తొలగించడానికీ సోషలిజానికి ప్రాతిపదికను నిర్మించడానికీ జరిగే పోరాటాన్ని—నిర్వహిస్తుంది.

ప్యారిస్ కమ్యూన్ నుంచి గడించిన అనుభవమూ, సోవియట్ యూనియన్ అన్ని రంగాల్లో సాధించిన విజయాలూ, నూతన ప్రజాతంత్రదేశాలు సాధించే విజయాలూ "రాజ్యాంగయంత్రం, విప్లవం"లో లెనిన్ చేసిన ఈ క్రింది సిద్ధాంతీకరణ ఎంత సరియైనదో నిరూపిస్తున్నాయి.

"కేపిటలిజంనుంచి కమ్యూనిజానికి జరిగే పరివర్తన తప్పనిసరిగా గొప్ప వైవిధ్యాన్ని సృష్టిస్తుంది. అనేక రాజకీయ రూపాలను అమల్లోకి తెస్తుంది. కాని వాటి అన్నిటి సారాంశం మీదా తప్పనిసరిగా ఒకటే— శ్రామిక నియంతృత్వం మాత్రమే - అయివుంటుంది."

("ఫర్ ఏ లాస్టింగ్‌పీస్ ఫర్ ఏ పీపుల్స్ డెమాక్రసీ" 15 మార్చి 1949.)

మార్క్సిస్ట్ విజ్ఞానం

# తక్కువ పనిదినం కోసం పోరాటం

కేపిటలిస్టు శ్రమశక్తిని దాని దినసరిరేటు (డే-రేటు) కు కొన్నాడు. ఒకపని దినంలోని శ్రమశక్తియొక్క ఉపయోగపు విలువ అతనికి చెందుతుంది. ఈవిధంగా శ్రామికునిచేత తనకోసం ఒక రోజుపని చేయించుకునే హక్కు పొందుతున్నాడు. అయితే అసలు పనిదినం అంటే ఏమిటి?

ఎట్టి పరిస్థితుల్లోనైనా నాసరే సహజంగా ఉండే రోజుకన్నా తక్కువ ఉంటుంది. అయితే ఎంతతక్కువ? పనిదినంయొక్క అవసరపరిమితిపై కాపిటలిస్టు అభిప్రాయాలు కాపిటలిస్టుకున్నాయి. కాపిటల్‌యొక్క స్వరూపమే కాపిటలిస్టు. కాపిటల్ (పెట్టుబడి) ఆత్మయే అతని ఆత్మ. కాని కాపిటల్‌కు ఒక ఏకజీవిత నైజం ఉంది. విలువనూ, అదనపు విలువనూ సృష్టిచేసేటటువంటి, ఉత్పత్తిసాధనాలను తన స్థిరమైన శక్తిగా చేసుకోవడం, ఎంత ఎక్కువ అదనపు శ్రమను ఇముడ్చుకోటానికి వీలుంటుందో అంతా ఇముడ్చుకోటం అనే తత్వం

కాపిటల్ మృతశ్రమ. గండభేరుండ పక్షిలాంటి ఈ కాపిటల్ జీవశ్రమను పీక్కుతింటేనే మాత్రమే బ్రతకగలదు. ఎక్కువ శ్రమను పీల్చుకుతిన్నకొద్దీ అది ఇంకా ఎక్కువకాలం బ్రతుకుతుంది. శ్రామికుడు పనిచేసే కాలమే, కాపిటలిస్టు అతనివద్దకొన్న శ్రమశక్తిని రాబట్టుకునే కాలం. శ్రామికుడు తన వినియోగకాలాన్ని సాధించుకుంటే అతను కేపిటలిస్టునుంచీ తనకు రావలసినదానిని రాబట్టుకుంటాడు. అప్పుడు కేపిటలిస్టు సరుకుల మారకం సూత్రం (లా) పై తనపంథా ననుసరిస్తాడు. కొనుగోలుదారు లందరిలాగానే అతనూ తనసరుకుయొక్క ఉపయోగపు విలువనుంచీ సాధ్యమైనంత తక్కువలాభాన్ని పొందాలని ప్రయత్నిస్తాడు. ఉత్పత్తిక్రమంయొక్క కబంధహస్తాల్లో బిగబట్టిన శ్రామికుని వాణి ఒక్కసారి పైకుబుకుతుంది.

నేను నీకమ్మిన సరుకు, ఇతరసరుకుల సముదాయంలాంటిది కాదు. దీని వుపయోగం, విలువను-తనకన్నా ఎక్కువైన విలువను-సృష్టిస్తుంది. అందుకే అది నువ్వుకొన్నావు. నీవద్ద తనకు తానుగా విస్తరించుతున్నట్లు కనిపించే కాపిటల్ వున్నదే, అది నేను అదనంగా ఖర్చుచేసిన శ్రమశక్తి. మార్కెట్టులో నువ్వూ నేనూ సరుకుల

మారకం అనే ఓ కేసూత్రం ఎరుగుదుము. సరుకుయొక్క వినియోగం, అది అమ్మే అమ్మకందారునికాదు. అది పొందే కొనుగోలుదారునిది. కాబట్టి నా ప్రతిరోజు శ్రమశక్తియొక్క ఉపయోగం నీకుచెందుతుంది. కాని ఆ శ్రమశక్తికి ప్రతిదినం నువ్వు చెల్లించే ఖరీదుద్వారా నేను దానిని, నిత్యం తిరిగి ఉత్పత్తిచేసి అమ్మగలిగేటట్లుండాలి. వయస్సు మళ్ళటంలాంటి సహజంగా వచ్చేవాటినట్లావుంచి; నేను ఇవ్వాళ ఎంత శక్తితో,ఆరోగ్యంతో,శుభ్రంతో పనిచేయగలనో రేపుకూడా ఆవిధంగా పనిచేయగలిగేటట్లుండాలి. "సీలింగు"ను గురించీ, "తొలగియుండటం" గురించీ నువ్వు నాకు నీతులుబోధిస్తావు. సరే! బాగానేవుంది. నేనుఒక పొదుపుగల సేవింగు యజమానిలాగా నా మూలధనాన్ని, శ్రమశక్తిని జాగ్రత్తచేస్తాను. ఆ శ్రమశక్తిని కాలివిశకుక్కవగా పాడుచేసుకునే దాన్నించీతొలగి యుంటాను(abstain). నేనుప్రతిరోజూ మామూలుగా పనికొనసాగించగల ప్రకారమే, ఆరోగ్యాభివృద్ధినిబట్టే పనికి వినియోగిస్తాను. అపరిమితంగా పనిదినాన్ని పెంచటంద్వారా, నేను 3 రోజులలో కూడా, కూడబెట్టుకోలేనంత శ్రమశక్తిని నువ్వు ఒక్కరోజులో ఉపయోగించుకోవచ్చు. నువ్వు శ్రమలో పొందినలాభం నాకు మూలంలో నష్టంవస్తుంది. నా శ్రమశక్తి వుపయోగం, దాన్ని పాడు చేయటం ఇవిరెండూ రెండు విభిన్నవిషయాలు. సగటుగా ఒక కార్మికుడు జీవించే సగటుకాలం (న్యాయమైనంత పనిచేస్తూ) 30 సంవత్సరాలైతే నా శ్రమశక్తికి రోజుకు నువ్వు చెల్లించే విలువ దాని మొత్తం విలువలో 1/365 × 30 లేక 1/10950 కాని నువ్వు ఆశ్రమశక్తినే పది సంవత్సరాల్లో కొనేస్తే దాని మొత్తం విలువలో 1/3650 చెల్లించడానికి బదులు 1/10950 చెల్లిస్తావు. అంటే దాని దినసరి విలువలో 1/3 వంతు మాత్రమే ఇస్తున్నావు. కాబట్టి ప్రతిరోజూ నాసరుకు విలువలో 2/3 వంతు నువ్వు దొంగిలిస్తున్నావన్నమాట. నువ్వేమో 3 రోజుల శ్రమ శక్తిని వినియోగించుకుంటావు. నాకు ఒకరోజు శ్రమ శక్తిమాత్రమే చెల్లిస్తావు. అదమనకాంట్రాక్టుకూ, మారకం సూత్రానికీ వ్యతిరేకం. అందుచేత నేను మామూలు (నార్మల్) పనిదినాన్ని డిమాండు చేస్తాను. అయితే నీ హృదయాని కిటువంటి విజ్ఞప్తి చేయటం ద్వారా నేని డిమాండు చేయుటంలేదు. ఎందుకంటే డబ్బువిషయా

లలో దయాదాక్షిణ్యాలకు తావులేదు. నువ్వొక ఆదర్శ పౌరుడవే కావచ్చు. జంతుహింస నిరోధక సంఘంలో సభ్యుడవుకూడా కావచ్చు. పవిత్రుడవు కావచ్చు. కాని నాతో ముఖాముఖీ వ్యవహారం వచ్చే సరికల్లా నీ ఎదురొమ్ములో హృదయం ఉండదు. అక్కడ వేగంగా కొట్టుకుంటున్నట్లు కనిపించేది నా హృదయస్పందనమే. నేను మామూలు పనిదినాన్ని కోరుతున్నా. ఎందుకంటే నేనూ అందరు అమ్మకందారుల లాగా నాసరుకు యొక్క విలువను డిమాండు చేస్తాను.

కాబట్టే కేపిటలిస్టు ఉత్పత్తి చరిత్రలో పని దినాన్ని నిర్ణయించటం అనేది, సమిష్టి శ్రమకూ అంటే కాపిటలిస్టు వర్గానికీ - శ్రామికవర్గానికీ మధ్య సంఘర్షణ ఫలితంగా ఏర్పడింది.

ఉత్తర అమెరికాయొక్క సంయుక్త రాష్ట్రాలలో కొంతభాగంలో బానిసత్వం వికృతరూపం ఉన్నంతకాలం, కార్మికుల స్వతంత్ర పోరాటాలన్నీ దెబ్బతిన్నాయి. శ్రమ ఒక్క నల్లరంగువాళ్ళకేనని చెప్పబడే చోట తెల్లరంగువాళ్ళుకూడా శ్రమనుంచి స్వేచ్ఛపొందనే లేదు. కాని బానిసత్వం నశించటంతో ఒక్కసారిగా నవ్యజీవితం తొలకరించింది. అంతర్యుద్ధం యొక్క మొదటి ఫలితం 8 గంటల ఆందోళన. ఈ ఆందోళన జాంబవంతుని అంగ లేసుకుంటూ అట్లాంటిక్ నుంచి పసిఫిక్ కూ, న్యూఇంగ్లండునుంచి కాలిఫోర్నియాకూ పాకిపోయింది. బాల్టిమోరులో జరిగిన లేబరు జనరలు కాంగ్రెసు (1866 ఆగస్టు 16) ఇలా ప్రకటించింది: "ఈ దేశంలోని కార్మికులను కాపిటలిస్టు దాస్యంనుంచీ విముక్తి కలిగించాలంటే ప్రస్తుతం మొదటి అత్యావసర విషయం అమెరికన్ యూనియన్‌లోని అన్ని రాష్ట్రాలలో 8 గంటల రోజు మామూలు పనిదినంగా చట్టం చేయాలి. ఈ మహత్తర ఫలితం సాధించేవరకూ మా బలాన్నంతా పణంపెట్టడానికి దృఢనిశ్చయులమైయున్నాం." అదే సమయంలో జనీవాలోని అంతర్జాతీయ కార్మికజనసమితి లండన్ జనరల్ కౌన్సిల్ ప్రతిపాదనపై ఈ నిర్ణయానికి వచ్చింది. "పనిదినాన్ని పరిమితంచేయుట మొదటిషరతు ఇది జరక్కుండా అభివృద్ధికీ స్వేచ్ఛకూ చేసే ప్రయత్నాలన్నీ నిష్ఫలం అని రుజువవుతాయి...... పనిదినంగా 8 గంటలుండటం చట్టసమ్మతిమైనదిగా కాంగ్రెసు ప్రతిపాదిస్తున్నది."

[కేపిటల్ వాల్యూం 1, 257, 259, 329 పేజీల్లో కెర్ ఎడిషన్, మోడరన్ లైబ్రరీ ఎడిషన్, పొలిటికల్ ఎఫైర్స్ మే సంచిక నుంచి]

# ఆంగ్లో-అమెరికన్ వైరుధ్యం

కార్మికవర్గాన్ని, వలస పరాధీనదేశాల ప్రజలనూ తమ అదుపాజ్ఞలలో వుంచుకొని దోపిడీచేసేందుకు ఒకే ఒక గొప్ప ఐక్య పెట్టుబడిదారీ రాజ్యాలకూటమిని ఏర్పరచాలని చాలకాలంగా గుత్తపెట్టుబడిదారులు కలలు గంటూ వచ్చారు. కాట్స్కీనుండి సర్ స్టాఫర్డ్ క్రిప్సు వరకూ గల అతివాద మితవాద మధ్యతరగతి సంస్కరణవాదులంతా యీ భ్రమనే కలిగించారు పెట్టుబడిదారీ సమాజస్వభావాన్ని బట్టి ఆ కలలన్నీ కల్లలవక తప్పదని మార్క్సిస్టులు మొట్టమొదటినుండీ చెప్తూనే వచ్చారు.

పెట్టుబడిదారీవిధానం అభివృద్ధిఅయిన ఒకానొక దశలో సామ్రాజ్యవాదులు ఒకరితోనొకరు కాట్లాడుకోవడం మానివేస్తారనీ కేపిటలిజంలో యింకా యుద్ధాలుండవనీ, అప్పుడు ఒక నూతన అత్యున్నత సామ్రాజ్యవాదం - ప్రపంచ సామ్రాజ్యవాదాల యూనియన్ ఏర్పడుతుందని కాట్స్కీ జోస్యంచెప్పాడు. లెనిన్ తన "సామ్రాజ్యవాదం" అనే గ్రంథంలో ప్రమాదకరమైన భ్రమపూరితమైన యీ సిద్ధాంతాన్ని చావుదెబ్బ కొట్టాడు. ఈ సిద్ధాంతం కార్మికులను తమ ప్రధానశత్రువుయొక్క బలాన్నీ, సంఘటితశక్తినీ ఎక్కువ అంచనావేసేటట్లు చేస్తుంది. అందుకనే అది ప్రమాదకరమైనది. అసమానత్వంగా అభివృద్ధిచెందే పెట్టుబడిదారీ విధానసూత్రమూ, కేపిటలిస్టుశక్తుల నూతన బలాబలాలను ఆధారం చేసుకొని అన్నింటికంటే బలవత్తరమైన సామ్రాజ్యవాద రాజ్యాలు ప్రపంచాన్ని పునర్విభజించడానికి ఎల్లప్పుడూచేసే ప్రయత్నమూ కేపిటలిస్టు రాజ్యాల ఐక్యతను అసాధ్యం చేస్తాయని లెనిన్ చూపెట్టాడు. అందుకనే యీ సిద్ధాంతం అనవసరభ్రమలను కారణభూతమవుతుంది. ఫైనాన్సు కేపిటల్ అభివృద్ధి చెందడం మూలంగా పెట్టుబడిదారీ ప్రపంచంలోని వివిధప్రాంతాల అభివృద్ధి రేటులోని వ్యత్యాసం మరింత ఎక్కువై సామ్రాజ్యవాద వైరుధ్యాలుమరింత అధికమయ్యాయి.

ఇరవయ్యో శతాబ్దంలోని కేపిటలిజంలోని అసమానత్వ అభివృద్ధియొక్క ఫలితమే త్వరితగతిని అభివృద్ధిచెందిన అమెరికా సామ్రాజ్యవాదం.

19 వ శతాబ్దం ఆఖరయ్యేటప్పటికే పారిశ్రామికదేశంగా బ్రిటన్‌కున్న ప్రధానస్థానాన్ని అమెరికా ఆక్రమించుకోగలిగింది. కాని ఆనాడు ప్రపంచవాణిజ్యంలో బ్రిటన్‌కున్న ఆధిక్యతా, విదేశ పెట్టుబడులూ, నౌకా పరిశ్రమలోనున్న ఆధిక్యతా దానికి గల వలసరాజ్యాల సంపదతోనూ పోల్చి చూసుకొంటే అమెరికా పారిశ్రామిక ఆధిక్యత తక్కువే. ప్రథమ

జేమ్సు క్లుగ్‌మాన్

ప్రపంచయుద్ధం ఆరంభ మయ్యేటప్పటికి అమెరికా ఉక్కు వుత్పత్తి బ్రిటన్‌కంటే నాలుగురెట్లు అధికం. ఇనుము మూడు రెట్లూ, పారిశ్రామిక ఉత్పత్తి విలువ 2½ రెట్లూ అధికం. 1914-18 యుద్ధానంతరం అమెరికా పెద్ద ఎత్తున పెట్టుబడులను ఎగుమతులను ఆరంభించి, బ్రిటన్‌తో పోటీ చేయడం ప్రారంభించి, ప్రపంచ కరెన్సీ కేంద్రంగా బ్రిటన్‌కున్న స్థానాన్నుండి దానిని పడద్రోయగలిగింది. విదేశ వ్యాపారంలో అమెరికా బ్రిటన్‌ను రెండోస్థానానికి త్రోసివేసింది. జర్మన్, అమెరికా కేపిటలిజంలు బ్రిటన్ ఎలా అధిగమించారో ఆ తరువాత జర్మనీ వెనకబడి, అమెరికా ప్రపంచంలోకెల్లా బలవత్తరమైన కేపిటలిస్టు రాజ్యంగా ఎలా అభివృద్ధి చెందిందో యీ క్రింద ఇవ్వబడిన లెక్కలు స్పష్టంగా తెలుపుతాయి.

పారిశ్రామిక ఉత్పత్తిలో పెరుగుదల లేక తరుగుదల

నూటికి వంతుల చొప్పున

| | 1860—1890 | 1890—1918 | 1918—1929 |
|---|---|---|---|
| బ్రిటన్ | +56 | +61 | —1 |
| జర్మనీ | +78 | +48 | +13 |
| అమెరికా | +113 | +156 | +70 |
| పెట్టుబడిదారీ ప్రపంచం | +86 | +133 | +47 |
| అమెరికా బ్రిటన్‌ల అభివృద్ధిలోనినిష్పత్తి | 113 : 56 లేక దాదాపు 2 : 1 | 156 : 61 లేక దాదాపు 2.5 : 1 | 70 : - 1 |

[ ఫర్‌కొంజున్‌టరు ఫోర్సుంసంస్థ — బెర్లిన్ - 1933 లెక్కలు ]

పై పట్టికలో చూపెట్టిన ఆఖరిదశనుండీ రెండు ప్రపంచయుద్ధాలకు మధ్య దశలోనూ, రెండో ప్రపంచ యుద్ధకాలంలోనూ ఆతరువాతనూ బ్రిటన్‌తో పోల్చి చూస్తే అమెరికా సామ్రాజ్యవాద విస్తరణ మరింత త్వరితగతిని యింకా యెక్కువగా విస్తరించింది. విదేశ పెట్టుబడులలోనూ, విదేశ వ్యాపారంలోనూ, పరపతిలోనూ, నౌకా పరిశ్రమలోనూ అమెరికా బ్రిటన్‌ను మించి దానిని వెనక్కినెట్టి తానుముందుకు వెళ్ళిపోయింది.

ద్వితీయ ప్రపంచయుద్ధానికి ముందు అమెరికా నావికాబలం 10 లక్షల టన్నులుంటే బ్రిటన్‌కు 12 లక్ష లుండేది. యుద్ధం ముగిసేటప్పటికి అమెరికా నౌకాబలం 38 లక్షలటన్నులయింది. బ్రిటన్‌కు 15 లక్షలు మాత్రమే వుంది.

రెండో ప్రపంచయుద్ధానికి ముందు అమెరికా వాణిజ్యనౌకలు మొత్తం 15 మిలియన్‌ల టన్నులుంటే బ్రిటన్‌కు 18మిలియనులటన్ను లుండేది. యుద్ధానంతరం అమెరికాకు 48 మిలియన్ టన్నులుంటే, బ్రిటన్‌కు 16మిలియన్ టన్నులుమాత్రమే. 1938లో అమెరికా ఎగుమతులు మొత్తం ప్రపంచ కేపిటలిస్టు ఎగుమతులలో నూటికి 13.5 వుంటే బ్రిటన్ ఎగుమతులు నూటికి 10.8 వుండేది. 1947 కు అమెరికాభాగం 32.6% వరకూ పెరిగితే బ్రిటను భాగం 10.3 లోనే వుండిపోయింది.

రెండో ప్రపంచ యుద్ధం ముగిసేటప్పటికి మొత్తం కేపిటలిస్టు ప్రపంచ ఉత్పత్తిలో నూటికి 60% పెట్టుబడి పెట్టే శక్తిలో నూటికి 75% అమెరికా సామ్రాజ్యవాదానికి చెంది పోయింది.

మొదటి ప్రపంచ యుద్ధానికి ముందు నానాటికి వృద్ధి చెందుతున్న జర్మన్ కేపిటలిజం ప్రపంచ మార్కెట్టులో బ్రిటన్ కున్న స్థానాన్ని సవాలుచేసి చివరకు మార్కెట్లనూ, ముడిపదార్థాలనూ, పెట్టుబడులనుపెట్టే భూభాగాలనూ పునర్విభజించాలని పట్టు బట్టి పోరాడింది. అలాగే యీనాడు అమెరికా సామ్రాజ్యవాదం అన్నివిధాలా తన పోటీదారులను మించిపోయి ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ప్రపంచ మార్కెట్లనూ, ముడిపదార్థాలనూ, పెట్టుబడులుపెట్టే భూభాగాలను పునర్విభజించాలని వొత్తిడిని ప్రారంభించింది. దీని అర్థ మేమంటే: మొదటి ప్రపంచ యుద్ధంలో జర్మనీ ఓడిపోయిన దగ్గరనుండీ ఆంగ్లో అమెరికన్ వైరుధ్యాలు ప్రారంభమై, నేటి పెట్టుబడిదారీ ప్రపంచంలో అదే ముఖ్య వైరుధ్యంగా యీనాటికీ కొనసాగుతోంది.

జోసఫ్ స్టాలిన్ 1928 లో యిలా వ్రాశాడు:

> "పెట్టుబడిదారీ ఉత్పత్తి విధాన అభివృద్ధికీ, యుద్ధావసరాలకూ అతి ముఖ్యమైన నూనె సమస్యను మనం తీసుకొన్నా - లేక ప్రపంచ పెట్టుబడిదారీ విధాన అభివృద్ధికీ దాని జీవితానికీ అతి ప్రధానమైన మార్కెట్ల సమస్యను (ఎందువలనంటే ఉత్పత్తిచేసిన వస్తువులను అమ్మడానికి మార్కెట్లు వుంటేనేగాని అసలు వస్తువులను ఉత్పత్తి చేయడమంటూ వుండదు) మనం తీసుకొన్నా - లేక తయారైన వస్తువులను రవాణా చేయడానికీ, ముడిపదార్థాలను తెచ్చుకోడానికి మార్కెట్టులకు గొనిపోయే ప్రధాన మార్గాల సమస్యను తీసుకొన్నా-యీ ముఖ్య సమస్యలన్నీ ఒకే ఒక ప్రధాన సమస్యకు దారితీస్తాయి.
>
> అదేమంటే: ప్రపంచాధిపత్యంకోసం ఇంగ్లాండు అమెరికాల మధ్య పోరాటం పెట్టుబడిదారీ విధానంలో బ్రహ్మాండంగా అభివృద్ధి చెందుతున్న దేశం - అమెరికా అదివరకే బలవత్తరంగా వేళ్ళు పాతుకు పోయిన ఇంగ్లాండుకు అన్ని చోట్లా పోటీగా పరిణమిస్తుంది."

సో. యూ. క. పార్టీ కేంద్ర కమిటీ విస్తృత సమావేశంలో (18 జులై 1928)

# 2

మానవచరిత్రలో కెల్లా మహోన్నత సంఘటన అక్టోబరు విప్లవం (1917) జరిగినప్పటినుండీ సామ్రాజ్యవాదులు ఒక గొప్ప ఐక్య కేపిటలిస్టు రాజ్యాలకూటమిని నిర్మించి, కార్మికుల అధికారాన్ని మొగ్గలోనే త్రుంచాలనీ, ప్రపంచ అభ్యుదయ శక్తులకు కేంద్రమైన సోషలిస్టు సోవియట్ యూనియన్‌ను నాశనంచేయాలనీ కలలుగన్నారు. కాని సోవియట్ వ్యతిరేక ఐక్యతలోనే అనేక బీటలు స్పష్టంగా కనబడ్డాయి. ఈనాడు పెట్టుబడిదారీ విధానంలో ప్రవేశించిన సర్వతోముఖ సంక్షోభం ఒకవైపున అభివృద్ధి చెందుతూవుండగా మరొకవైపున సోవియట్ యూనియన్ చుట్టూవున్న అభ్యుదయ కాముక శక్తులు సామ్రాజ్యవాదుల దోపిడీనుండీ నూతనభూభాగాలను విముక్తి చేస్తున్నాయి. గుత్తపెట్టుబడిదారులకూ కార్మికవర్గానికీ మధ్య పోరాటం ఒకవైపున తీవ్రతరమవుతువుండగా మరొకవైపున వలస పరాధీన దేశాల ప్రజల విముక్తి పోరాటాలు బలవత్తరంగా అభివృద్ధి చెందుతున్నాయి. అదేసమయంలో పెట్టుబడిదారీ ప్రపంచం తగ్గిపోతున్నకొద్దీ సామ్రాజ్యవాదులమధ్య అంతర్గత వైరుధ్యాలు మరింత తీవ్రతరమవుతున్నాయి.

ఇదే చరిత్రయొక్క గొప్ప పరస్పర వైరుధ్యం. అభ్యుదయ శక్తులను త్రుంచివేయాలని సామ్రాజ్యవాదులు ఐక్యమవడానికి ప్రయత్నంచేసినకొద్దీ, తమ ఐక్యతనుగురించి గొప్పగా వారు మాట్లాడినకొద్దీ, అందుకోసం ఎన్నో కూటాలనూ, యూనియన్లనూ, సంధులను చేసుకొన్నకొద్దీ మరొకవైపున నానాటికి కొంచపడుతున్న కేపిటలిస్టు ప్రపంచ పునర్విభజనకోసం వారిలోవారికి తీవ్రమైన పోరాటాలు ప్రారంభమవక తప్పదు.

దేశద్రోహకరమైన పెట్టుబడిదారులు ఎంత ఎక్కువగా తమప్రజల ప్రయోజనాలకు ద్రోహంచేసి వాల్‌స్ట్రీట్ "నాయకత్వాని"కి లొంగి అమెరికా గుత్తవ్యాపారసంస్థల సహాయాన్ని అంగీకరిస్తే నానాటికీ తగ్గిపోతున్న పతనమవుతున్న సంక్షోభాభరిత మవుతున్న కేపిటలిస్టు ప్రపంచంలో అమెరికా సామ్రాజ్యవాదం తన మిత్రరాజ్యాల ప్రయోజనాలకు విరుద్ధంగా క్లిష్టసమస్యలను పరిష్కరించడానికి ప్రయత్నాలు చేస్తుంది. వారు ఎంత ఎక్కువగా ఐక్యమైతే అంతఎక్కువగా విభేదాలతో చీలిపోతారు.

పెట్టుబడిదారీ ప్రపంచంలో తన స్థానబలిమి తగ్గిపోతున్నప్పటికీ బ్రిటన్ రెండో ప్రపంచ యుద్ధానంతరం సహితం యుద్ధవ్యూహందృష్ట్యా అత్యంత ముఖ్యమైన స్థానాలనూ, గొప్ప వలసదేశ మార్కెట్లనూ, పెట్టుబడులను పెట్టడానికి అవసరమైన ప్రాంతాలనూ, ముడిపదార్థాలను తెచ్చిపెట్టే ప్రాంతాలనూ కలిగివుంది. బ్రిటన్‌కున్న యీ ఆధిక్యతను నూతన బలాన్ని సంపాదించుకొన్న అమెరికా అంగీకరించలేకపోయింది. అందువలననే ద్వితీయ ప్రపంచ యుద్ధానంతర దశలో

రాజకీయంగా, ఆర్థికంగా, యుద్ధవ్యూహ రీత్యా బ్రిటన్‌కున్న స్థానాలపై అమెరికా సామ్రాజ్యవాదం దాడిని ప్రారంభించింది.

వెయ్యివిధాలుగా ఆంగ్లో-అమెరికన్ వైరుధ్యాలు కప్పిబుచ్చబడినప్పటికీ నేటి కేపిటలిస్టు ప్రపంచంలో అదే అన్నింటికంటే తీవ్రమైనది. ఇదివరకెన్నడూ లేనంతగా ఆ వైరుధ్యం నేడధికమైంది.

# 3

రెండో ప్రపంచయుద్ధానంతర మొదటి దశలో సోషలిజంయొక్క పురోగమనాన్ని అడ్డుకునేందుకు సామ్రాజ్యవాద ప్రపంచంలోవున్న తీవ్ర వైరుధ్యాలను తియ్యని మాటలతో మరుగుబుచ్చడానికి ప్రయత్నాలు జరగడమేగాక, ఏదోవిధంగా అమెరికా నాయకత్వాన సమాధానం కుదుర్చుకోడానికికూడా తీవ్రమైన ప్రయత్నాలు జరిగాయి. అంతేకాదు యుద్ధంలో దెబ్బతిన్న పశ్చిమ యూరప్ కేపిటలిస్టు ప్రభుత్వాలు అమెరికానుండి సరకులను స్వీకరించడానికి, అవిఘ్నంగా తమ అదనపు సరకులనువిడుదలచేసుకోడానికి, అమెరికా గుత్తపెట్టుబడిదారీసంస్థలు సంసిద్ధపడటం జరిగింది. ఈ సందర్భంలోనే ట్రూమన్ సిద్ధాంతాన్నీ, మార్షల్ పథకాన్నీ, పశ్చిమ యూనియన్‌నూ, అట్లాంటిక్ సంధినీ సామరస్యానికి ఐక్యతనో, సమాధానానికి ఆటపట్టయినట్లు టోరీలు, మితవాద లేబరు నాయకులూ, వాల్‌స్ట్రీట్ రాజకీయ వేత్తలూ ప్రచారం చేశారు.

పెట్టుబడిదారీదేశాల మధ్యగల యీ సామరస్యనాటకానికి వెనుక తప్పనిసరిగా పనిచేసే కేపిటలిస్టు ఆర్థికవిధానసూత్రాలు తమ కార్యక్రమాన్ని విసాగిస్తూనేవున్నాయి. అన్ని దేశాలలోనూ కమ్యూనిస్టులు మొట్ట మొదటనుండీ హెచ్చరికలు చేస్తున్నట్లే గొప్పగా తమలోతాము పొగడుకొంటున్న "పాశ్చాత్య నాగరికత ఐక్యతా" పథకాల వెనుక అన్నిటికంటే బలవత్తరరాజ్యం యొక్క ప్రయోజనాల కనుగుణ్యంగా కేపిటలిస్టు ప్రపంచ పునర్విభజన కొనసాగుతూవుంది. అమెరికాలోని పెద్దపెద్ద గుత్తపెట్టుబడిదారీ కార్పొరేషనులు తమ ప్రభుత్వంద్వారా పెట్టుబడిదారీ ప్రపంచమంతటికీ ప్రాకుతున్నాయి. కీలుబొమ్మ ప్రభుత్వాలు నిర్మించుతున్నాయి. వలసిన భూ భాగాలను కాలును తీసుకొంటున్నాయి. పోటీపరిశ్రమలను ధ్వంసం చేస్తున్నాయి. తమ "మిత్రుల" నుండి మార్కెట్లను వశపరచుకొంటున్నాయి. "మర్యాదగా" తమ "మిత్రులను" ప్రధాన పెట్టుబడి భూ భాగాలనుండి తొలగించుతున్నాయి. మార్షల్‌ప్లాను బూటకం వెనుక యీ విధంగా అమెరికా బ్రిటిషు సామ్రాజ్యంపై దాడిచేస్తోంది. దానితో బ్రిటన్ తనకంటే బలహీన రాజ్యాలలోకి చొచ్చుకొనిపోవడానికి ప్రయత్నించుతోంది.

తిరిగి యీనాడు పెట్టుబడిదారీ ప్రపంచంలోకి నూతనంగా ఆర్థిక మాంద్యం ప్రవేశించగానే ఇదివరకు దాచబడి వున్న వైరుధ్యాలన్నీ మరొకసారి బహిరంగంగా ప్రత్యక్షమయ్యాయి. తిరిగి కేపిటలిస్టు ప్రపంచంలో అత్యంత దారిద్ర్యం అమితి భోగ భాగ్యాలు ఒకేసారి వుండే వైరుధ్యాన్ని మళ్ళా చూస్తున్నాము. ఈ పెట్టుబడిదారీ ప్రపంచంలో

"కావలసినంత అత్యధికంగా" గోధుమలున్నాయి. అదే సమయంలో మరొకవైపున లక్షోపలక్షల ప్రజలు తిండిలేక కరువువాత పడుతున్నారు. ఈ కరువును అమెరికా పెట్టుబడిదారులు ఆహ్వానించుతారు.

తూర్పు యూరప్‌తోనూ, సోవియట్ యూనియన్‌తోనూ బ్రిటన్ తన వ్యాపారాన్ని నిషేధించిందిగాబట్టి యిక అమెరికా తన అదనపు ధాన్యాన్నంతటిని బ్రిటన్‌కు గుప్పటం ప్రారంభించింది.

ఈనాడు కేపిటలిస్టు ప్రపంచంలో "ఎక్కువెక్కువగా" ఉక్కున్నది, "ఎక్కువెక్కువగా" రాగి, తుత్తునాగం వున్నాయి. అలాగే "ఎక్కువెక్కువగా" తగరం, నావలు, బొగ్గులు, బట్టలూ వున్నాయి. మార్కెట్లకోసం వొత్తిడి మరొకసారి తీవ్రమైంది. నిరుద్యోగ సమస్య ఎక్కువైంది. అయితే కేపిటలిస్టులు జీతాలను కోయడానికి దీనిని ఆహ్వానిస్తారు. "అమ్మేవారికి మార్కెట్టు" యిక వుండదు. ప్రతి కేపిటలిస్టుగ్రూపూ యీ సంక్షోభ భారాన్ని కార్మికవర్గంపైనా, వలసదేశాల ప్రజలపైనా, తమపోటీదారులైన కేపిటలిస్టు "మిత్రుల" పైనా త్రోయడానికి ప్రయత్నిస్తుంది. అమెరికా సామ్రాజ్యవాదం ఆర్థిక మాంద్యాన్ని తన "బలహీన" భాగస్తులకు-ముందుగా తన జూనియర్ భాగస్తురాలైన బ్రిటనుకు ఎగుమతి చేయడానికి పూర్తిగా ప్రయత్నిస్తుంది. తిరిగి బ్రిటన్ యింకా తనకు జూనియర్ సామ్రాజ్యవాద "మిత్రుల"పై త్రోయడానికి ప్రయత్నిస్తుంది. దీనితో వివిధ కేపిటలిస్టు రాజ్యాలమధ్య "ఆనందకరమైన" దశ సంపూర్ణమైంది. జూన్ 23 వ తేదీన అమెరికా ప్రభుత్వ ఉప కార్యదర్శి కేపిటలిస్టు ప్రపంచంలోని పరిస్థితిని గురించి యిలా సమీక్ష చేశాడు:

"మన అంతర్జాతీయ ఆర్థిక వ్యవహార సంబంధాలలో ఒక నూతన గడ్డుదశలోకి మనం ప్రవేశించతున్నాం. అత్యధిక దేశాలలో వస్తువుల కొరత వున్నంతకాలమూ అన్ని దేశాలలోని ప్రజలు తమ శక్తికొలదీ ఒకేదృష్టికోణంతో కృషి చేయడం సంభవించింది. అప్పుడు వివిధ జాతుల పాలసీలలో వైరుధ్యం వుండే అవకాశం లేకపోయింది.

"అంతర్జాతీయ ఆర్థిక సంబంధాలలోని యుద్ధానంతర ఆనందకరమైన దశ నేడు పూర్తికావస్తోంది. ఇంక భవిష్యత్తులో వివిధ దేశాలూ ఆర్థికరంగంలో ఒకరినొకరు సహాకరించుకోవడంలో గడ్డు పరిస్థితి ఏర్పడింది. అసలు యదార్థమేమంటే వివిధ కేపిటలిస్టు రాజ్యాలమధ్య పోటీలూ వైరుధ్యాలు ఉత్పన్నమవడం ప్రారంభమైంది. విదేశ మార్కెట్ల విషయంలో పోటీ తిరిగితలెత్తడంఆరంభమైంది."

# 4

నానాటికీ తీవ్రతర మవుతున్న ఆంగ్లో అమెరికన్ పరస్పర వైరుధ్యం ఒకరకంగా తగ్గిపోతున్న అమెరికా మార్కెట్టులో ప్రతిబింబించుతోంది. అమెరికాకు ఎగుమతులను పెంచాలని మితవాద లేబరు నాయకులు ఎంత ఎక్కువగా నినాదాలను వల్లించుతూవుంటే అంతఎక్కువగా జ్యేష్ఠభాగస్తురాలైన అమెరికా బ్రిటిష్ దిగుమతులను తగ్గించివేస్తోంది. 1949 మార్చి ఏప్రిల్ మాసాలమధ్య బ్రిటిషు నెలసరి ఎగుమతులు మాసానికి సగటున 5. 7 మిలియన్ పౌన్లనుండి 3. 7 మిలియన్ల పౌన్లకు పడిపోయింది. ముఖ్యంగా మోటారుకార్లు, దూది, వూలు బట్టలూ, ఇంజనీరింగు వస్తువులు విస్కీ ఎగుమతులు తగ్గాయి.

తన సామ్రాజ్యంలోని ఆహారపదార్ధాలనూ, ముడిపదార్ధాలను ప్రధానంగా మలయానుండి రబ్బరు, తగరం, ఇండియానుండి జనపనార, దక్షిణాఫ్రికా ఆస్ట్రేలియాలనుండి వూలు, సిలోను, పశ్చిమ ఆఫ్రికాలనుండి తేయాకుల ఎగుమతుల వలననే బ్రిటన్‌కూ, కామన్‌వెల్తుకూ డాలర్లు లభిస్తాయి. బ్రిటన్‌నుండి నేరుగా అమెరికాకు వెళ్ళేఎగుమతులకు రెట్టింపుగా పై ఉదహరించిన ఎగుమతులు అదే కాలంలో తగ్గిపోయాయి. రబ్బరు, తగరం కోకో వజ్రములు వూలు ఎగుమతులు 1949 సంవత్సరం మొదటి నాలుగు మాసాలలో 120 మిలియన్ డాలర్లువుంటే రెండో నాలుగు మాసాలలో 60 మిలియన్ల డాలర్లకు తగ్గిపోయింది. అమెరికాలో కృత్రిమపద్ధతులలో తయారుచేసే రబ్బరు మలయా రబ్బరు ఎగుమతులనూ కృత్రిమ విస్కీ స్కాట్లండువిస్కీ ఎగుమతులనూ బాగా తగ్గించివేస్తున్నాయి.

ప్రపంచ మార్కెట్టు విషయంలో ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదుల పోరాటం పశ్చిమ జర్మనీతోనూ, జపాన్‌తోనూ, బ్రిటన్ పోటీపడుతున్న సందర్భంలో స్పష్టంగా ద్యోతక మవుతుంది. జర్మనీతో జరిపే పోటీ విషయంలో బ్రిటన్‌యొక్క పరస్పర వైరుధ్య పాలసీ స్పష్టంగా కళ్ళకుగట్టుతోంది. 1917 నుండి తాను కోరుతున్నట్లుగా జర్మనీ ఒక బలమైన సోవియట్ వ్యతిరేక నిలయంగా వుండాలని బ్రిటన్ వాంఛించుతోంది. అలాంటి సోవియట్ వ్యతిరేక కేంద్రాన్ని అమెరికా మాత్రమే నిర్మించగలదని బ్రిటన్ నేడు గుర్తించవలసి వచ్చింది. పశ్చిమ జర్మనీపట్ల అమెరికా పాలసీని సామాన్యంగా బ్రిటిష్ ప్రభుత్వం బలపరచడమేగాక ఒక్కొక్కప్పుడు తానే స్వయంగా చొరవతో ఆ పాలసీని నిర్ణయించటంకూడా కద్దు. అయితే దీని వలన బ్రిటిష్ సామ్రాజ్య ప్రయోజనాలను దెబ్బకొట్టే ఒక శక్తిని డాలర్ సామ్రాజ్యవాదుల కంట్రోలుక్రింద నిర్మించడానికి తనే స్వయంగా సహాయపడుతున్నది. విదేశ మంత్రుల సమావేశంలో అమెరికా పాలసీకి అనుకూలంగా బెవిన్ చేసే ప్రతి ఒక్క వోటూ నౌకాపరిశ్రమలోనూ, ఇంజనీరింగు వస్తువులలోనూ, శాస్త్రీయ పరికరాలలోనూ తనకు వ్యతిరేకంగా అమెరికా పోటీని అధికం చేసుకొంటున్నది. అలాగే డాలర్ సామ్రాజ్యవాదుల ఆధిపత్యాన జపాన్‌లో సోవియట్ వ్యతిరేక కేంద్రాన్ని నిర్మించడానికి బ్రిటన్

రాజకీయంగా సహాయపడుతోంది. కాని యిది బ్రిటిష్ సామ్రాజ్యవాద ఆర్థిక విధానాన్ని ప్రధానంగా దెబ్బతీస్తుంది. ఆర్థిక మాంద్యం అధికమవుతున్నకొద్దీ జపాన్, పశ్చిమ జర్మనీలతో ఆర్థికరీత్యా పోటీపడే స్వరూపంలో ఆంగ్లో - అమెరికన్ వైరుధ్యం మరింత తీవ్రతర మవుతోంది.

అన్నింటికంటే ముఖ్యంగా బ్రిటిషు కామన్‌వెల్తులోనికి అమెరికా ప్రత్యక్షంగా చొచ్చుకొని పోవడం ప్రారంభమైంది. విపరీతమైన పటాటోపంతో ప్రకటించబడిన ట్రూమన్ అధ్యక్షుని "నాలుగో పాంశం" (20 జనవరి 1949) బ్రిటన్‌పై మరొక తీవ్రమైన దాడిమాత్రమే. అమెరికా రోజురోజుకూ బ్రిటిషు కామన్‌వెల్తులోని బ్రిటిషు మార్కెట్లను స్వాధీనపరచుకొంటోంది. 1939-1948 సంవత్సరాల మధ్యకాలంలో కెనడాకు బ్రిటిషు ఎగుమతులు మూడురెట్లకు తక్కువగా (విలువలో) పెరిగితే అమెరికా ఎగుమతులు నాలుగురెట్లు పెరిగాయి.

ఇదేకాలంలో ఇండియాకు బ్రిటిషు ఎగుమతులు 4 రెట్లు పెరిగితే అమెరికా ఎగుమతులు 7 రెట్లు పెరిగాయి: మలయాకు బ్రిటిషు ఎగుమతులు మూడు రెట్లకు తక్కువగా పెరిగితే అమెరికా ఎగుమతులు 8 రెట్లు పెరిగాయి. 1948లో బ్రిటిష్ ఇనుమూ, ఉక్కు ఎగుమతులు దాదాపు 1938 స్థితికి అందుకోగా అమెరికా ఇనుమూ, ఉక్కు ఎగుమతులు రెట్టింపయ్యాయి. 1947లో బ్రిటిష్ కామన్‌వెల్తుకు బ్రిటిష్ ఇనుము, ఉక్కు ఎగుమతులకంటే అమెరికా ఎగుమతులు రెట్టింపుకు పైగా పరిణమించింది. (1386779 టన్నులకు 514111 టన్నులు)

ఈక్రిందయివ్వబడిన పట్టిక (అమెరికా వాణిజ్యశాఖకు సంబంధించిన అమెరికా ఎగుమతులలెక్కలనుండి తీసుకొనబడింది) బ్రిటిషు కామన్‌వెల్తుకు అమెరికా ఎగుమతులు త్వరితగతిని పెరుగుతున్న విషయాన్ని స్పష్టంగా చూపెడుతుంది.

[ఈ పట్టికలోని అంకెలు మిలియన్‌ల డాలర్లు తెలుపుతాయి.]

| | 1938 | 1947 |
|---|---|---|
| కెనడా | 489.1 | 2012.0 |
| ఇండియా | 42.8 | 8.9.7 |
| న్యూజీలాండ్ | 16.5 | 76.6 |
| దక్షిణాఫ్రికా యూనియన్ | 69.1 | 412.3 |
| ఆస్ట్రేలియా | 61.5 | 234.7 |
| బర్మా | 4.1 | 5.6 |
| సిలోన్ | 1.6 | 47.1 |
| బ్రిటిష్ మలయా | 10.0 | 65.5 |
| హాంకాంగ్ | 18.1 | 88.6 |
| జమైకా | 5.9 | 23.8 |

ఇంతకంటే యెక్కువగా బ్రిటిషు కామన్‌వెల్తులోనికి అమెరికా పెట్టుబడులు ప్రవేశించడం ప్రారంభమైంది. ట్రూమన్ ప్రణాళికలోని నాలుగోహాంశం ప్రకటించబడిన కొద్దిరోజులలోనే అమెరికా "అభివృద్ధి" ప్రణాళికవలన "లాభపడే" "ఖచ్చితమైన ఒక దేశం" ఇండియా అని అచిసన్ పేర్కొన్నాడు. 1949 ఫిబ్రవరి 4 వ తేదీన అమెరికా ఆధిపత్యంలోవున్న అంతర్జాతీయ బ్యాంకుకు చెందిన ఒక కమీషన్ పరిశీలనకై ఇండియాలో పర్యటనను ప్రారంభించింది. "ఇండియా తనకు అనుగుణ్యంగా" కనపడిందని బ్యాంకు అధ్యక్షుడైన మేక్లాయి ప్రకటించాడు. ఫిబ్రవరిలోనే అమెరికాతో ఇండియా "నావికా వాణిజ్య స్నేహ ఒడంబడిక" చేసుకోడానికి ఒక చిత్తు ఒడంబడికను పరిశీలించుతున్నదని నెహ్రూ ప్రకటించాడు.

[కొమింగ్‌టాంగ్ చైనా, ఫిలిప్పైన్సు పోకడలు!]

అయితే ఆంగ్లో-అమెరికన్ పరస్పర వైరుధ్యాన్ని దాని నగ్నరూపంలో స్పష్టంగా చూడాలంటే మన దృష్టిని ఆఫ్రికావైపుకు ప్రసారించాలి. అక్కడకు జరిగే వస్తువుల ఎగుమతులూ, పెట్టుబడుల ఎగుమతులను పరిశీలించాలి. ఆర్థిక మాంద్యం అధికమవుతున్నకొద్దీ సామ్రాజ్యవాదులంతా ఆఫ్రికావైపుకు మరలారు. వలసదేశాల ప్రజలను అత్యధికంగా దోపిడీ చేయడమొక్కటే వారికి ముక్తిమార్గంగా కనపడింది. బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ఆఫ్రికాలో కాపాడాలని మిస్టర్ స్ట్రాచీ ఆశిస్తున్నాడు. ఆలాగే ఫ్రెంచి, బెల్జియన్, పోర్చుగీసు ప్రభుత్వాలు. పశ్చిమ యూనియన్‌కు ఆఫ్రికాను ఆర్థికపునాదిగా అంచనా వేశారు. వీటన్నిటికీ పైగా అమెరికా తన వస్తువుల ఎగుమతులకూ, పెట్టుబడుల ఎగుమతులకూ ఆఫ్రికాను అనువైన ప్రాంతంగా గణిస్తోంది. ఆఫ్రికా ప్రజలు మరింత అధికంగా దోపిడీ చేయబడాలనే విషయంలో మాత్రం సామ్రాజ్యవాదులందరూ సంపూర్ణంగా ఏకీభవించుతున్నారు. అయితే ఒక సమస్య ఉదయించుతుంది. ఎవరు దోపిడీ కార్యక్రమాన్ని సాగించాలి? ఇక్కడే సామ్రాజ్యవాదుల మధ్య అంతర్గతంగా వున్న వైరుధ్యాలన్నీ బయటపడుతున్నాయి. తన చిన్న పోటీదార్లందరినీ త్రోసిరాజనడానికి బ్రిటిష్ సామ్రాజ్యవాదం ప్రయత్నించుతోంది. "పాతసామ్రాజ్యవాదులంతా" "కొత్తవారికి" వ్యతిరేకంగా ఏకమవుతున్నారు. కాని అన్నిటికంటే తీవ్రతరమైన వైరుధ్యం తిరిగి ఆంగ్లో-అమెరికన్‌ల మధ్యనే. "ట్రూమన్" నాలుగోహాంశం (జనవరి 20) ప్రకటించబడిన తరువాత "ఇది ప్రధానంగా ఆఫ్రికా ఖండాన్ని గురించిన సమస్యయే" అని అమెరికా రాజకీయవేత్త హారిమాన్ జనవరి 28 వ తేదీన ఖచ్చితంగా ప్రకటించాడు.

ఈ సంఘటనలను దృష్టిలో వుంచుకొంటే ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల యిటీవల సంబంధాలను యింకా బాగా అర్థంచేసుకోవచ్చు. యూరోపియన్ రాజ్యాలమధ్య డబ్బు చెల్లించుకొనే విషయంలోవున్న గందరగోళాన్నీ, నాణెం విలువను తగ్గించే విషయాన్నీ, ఆంగ్లో-అర్జెంటైనా వాణిజ్యసంధి సమస్యనూ ఏవో ప్రత్యేకంగా వుదయించిన

సమస్యలుగా చిత్రించడానికి బూర్జువా రాజకీయవేత్తలూ, మితవాద లేబరునాయకులూ ప్రయత్నించుతారు. అవి యేవో ఆచరణలో అమలుజరపడంలో వచ్చిన కొద్దిపాటి అభిప్రాయభేధాలుగా చెపుతారు. వాటిని వేరే పరిష్కరించుకోవచ్చునని సమాధానం చెపుతారు. "అందరం వ్యాపారం జరుపుకోవచ్చు"నని అమెరికా ప్రభుత్వం యిచ్చే నినాదం అమెరికా ఎగుమతులకున్న అన్ని అడ్డంకులను తొలగించుకోడానికేననే విషయం గ్రహించడం సులభమే. ఇద్దరికి కలిపి జరిగే వాణిజ్య ఒడంబడికలు పెద్ద కేపిటలిస్టు రాజ్యానికెప్పుడూ సరిపడవు. ఎందువల్లనంటే "సమాన అవకాశం" గల పాలసీ అనుసరించే టప్పుడల్లా అన్నింటికంటే బలమైన కేపిటలిస్టురాజ్యం తప్పక విజయం పొందగలుగుతుందనే విషయం సుస్పష్టమే. పౌండు నాణెంయొక్క విలువను తగ్గించాలని బ్రిటన్‌పై అమెరికా తెస్తున్న విపరీతమైన వొత్తిడి స్టర్లింగు ప్రాంతాల్నుండి చౌకగా ముడివస్తువులను అది సేకరించుకోవడం కోసమే — ఈ వొత్తిడిలో వున్న మరొక విశేషమేమంటే: పెట్టుబడిదారీ ప్రపంచంలోవున్న ఒకే ఒక పోటీకి కరెన్సీని దెబ్బకొట్టడంకోసమే. లేక కనీసం అది డాలర్‌కు పూర్తిగా లొంగివుండేటట్లు చేయడంకోసమే. అన్నింటికంటే ముఖ్యంగా బ్రిటన్‌కూ, బ్రిటిషు కామన్‌వెల్తుకు అమెరికా చేసే ఎగుమతుల విలువను అధికంచేసుకోడానికి చేసే ప్రయత్నమే యిది. ఛేస్ బ్యాంకు అధ్యక్షుడు విన్‌స్టన్ ఆల్‌డ్రిచ్ మే24వ తేదీన సావాయి హోటల్‌లో మాట్లాడుతూ యిలా వివరించాడు: అమెరికా పెట్టుబడి బ్రిటన్‌కు పంపవలసివస్తే దానికి (బ్రిటన్ కేపిటలిస్టు గుప్పిటనుండి) "రాజకీయ స్థిరత్వానికే" గాక "ఆర్థిక స్థిరత్వానికీ" డాలర్‌కూ, పౌండుకూ మధ్య "వాస్తవిక" మారక విలువకూ గ్యారంటీ వుండవలసి వుంటుందని అతడన్నాడు.

## 5

అంతర్జాతీయ కార్మికోద్యమానికి సామ్రాజ్యవాద రాజ్యాలమధ్య వైరుధ్యాలు అముఖ్యంకాదు. దీనికి సర్గ్గా వ్యతిరేకంగా శాంతిశిబిరంలో వున్న నూతనప్రజాతంత్ర రాజ్యాలకూ సోవియట్ యూనియనుకు మధ్య పరస్పరవిశ్వాసాలూ ఐక్యతాభావాలూ ఎలా అభివృద్ధి చెందుతున్నవో శ్రామిక ప్రజలు చూడగలుగుతారు. శాంతిశిబిరంలోవున్న యితర రాజ్యాలకు సోవియట్ యూనియన్ భారీపరిశ్రమలకు అవసరమైన యంత్రసామగ్రినీ, ఆహారపదార్థాలనూ, యితర ముడిపదార్థాలను ఎగుమతిచేస్తుంది. అది తన మిత్రులను బలహీనపడేటట్లుగాక బలపడేటట్లుగా చేస్తుంది. అది సౌభాగ్యాన్ని ఎగుమతి చేస్తుందిగాని నిరుద్యోగ ఘూతాన్ని కాదు. సోషలిస్టు నూతనప్రజాతంత్ర రాజ్యాల కుటుంబం ఒకవైపున బలంగానూ, దృఢంగానూ అభివృద్ధి చెందుతూవుంటే మరొకవైపున కూలిపోతూ కంపుకొడుతున్న పెట్టుబడిదారీ రాజ్యాలూ, బలంగలరాజ్యాలు పేద రాజ్యాలను మరింత దరిద్రవంతం చేయడం, ఒకరినష్టంపై మరొకరు తనసమస్యలను పరిష్కరించుకో జూడటం, సరిపడని స్నేహాలు, నానాటికీ వృద్ధి అవుతున్న

విరోధభావాలూ - యివన్నీ తమదేశాలను ఆంగ్లో - అమెరికన్ యుద్ధకూటమి నుండి బయటకు తెచ్చి సోవియట్ యూనియన్ నాయకత్వాన శాంతి అభ్యుదయాల శిబిరానికి పురోగమించేందుకు కార్మికవర్గ నాయకత్వాన ఆయాప్రజలు పోరాడేటట్లు చేస్తాయి.

సామ్రాజ్యవాదులమధ్య యీ విధంగా హెచ్చుతున్న వైరుధ్యాలు బ్రిటిష్ కార్మికుల ముందూ బ్రిటిష్‌ప్రజలముందు కష్టతరమైన సమస్యలనేగాక మహత్తరమైన బాధ్యతలనుకూడా పెడుతున్నాయి. ఆర్థికమాంద్యపు బరువునంతా కార్మికవర్గంపై త్రోయడానికి గుత్తపెట్టుబడిదారీ సంస్థలూ, టోరీలూ, మితవాద లేబరునాయకులూ చేసే ప్రయత్నాలను వారు ఎదుర్కొని పోరాడాలి. అమెరికా, బ్రిటన్ సామ్రాజ్యవాదాల ప్రమాదాన్నుండి బ్రిటన్ స్వాతంత్ర్యాన్నీ బ్రిటిషు జాతియొక్క నిజమైన ప్రయోజనాలను కాపాడటానికి వారు పూనుకోవాలి. ఈ విధంగా వారు కృషిచేసే సందర్భంలో బ్రిటిషు సామ్రాజ్యవాదుల ప్రయోజనాలనూ కాపాడేస్థితికి తాము దిగజారకుండా జాగ్రత్త తీసుకోవాలి. తమ సమస్యలను పరిష్కరించుకొనేందుకు యితర దేశాల యితరప్రజల కార్మికుల ప్రయోజనాలకు విరుద్ధంగా వలసదేశాలప్రజలను మరింత దోపిడిచేయడానికి బ్రిటిషు సామ్రాజ్యవాదులుచేసే ప్రయత్నాలకు ఎంతమాత్రం సానుకూలపడకుండా బ్రిటిష్ ప్రజలు జాగ్రత్తపడాలి.

నిరుద్యోగ సమస్యకు వ్యతిరేకంగానూ, కనీస జీవన ప్రమాణం కోసం, సోవియట్ యూనియన్‌తోనూ, తూర్పు యూరప్‌తోనూ వ్యాపార సంబంధాలను ఏర్పరచుకొనేందుకూ, శాంతికి, బ్రిటన్ స్వాతంత్ర్యానికి జరిపే బ్రిటిష్ ప్రజల పోరాటం అమెరికా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటానికి దోహదం చేస్తుంది. అయితే అలాంటి పోరాటాన్ని బ్రిటిష్ సామ్రాజ్యవాదం నాయకత్వాన సామ్రాజ్యవాద పద్ధతులలోను కొనసాగించరాదు.

ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదుల వైరుధ్యం తీవ్రతరమవుతున్న యీదశలో ఉభయ సామ్రాజ్యవాదాలకు వ్యతిరేకంగా బ్రిటిషు అమెరికన్ కార్మికుల మధ్యా, అభ్యుదయ కాముక ప్రజలమధ్య సన్నిహిత సంబంధమూ, సహకారమూ కలిగిన సంయుక్తపోరాటమే నేటిప్రధాన కర్తవ్యం.

జీవనప్రమాణంకోసం, శాంతి స్వాతంత్ర్యాలకోసమూ జరిగేపోరాటమే బ్రిటిషు సామ్రాజ్యవాదవిధానాన్ని తుదముట్టించడానికి జరిగే అంతిమ పోరాటాన్ని బలపరుస్తుంది. ఇంక చివరమాట చెప్పవలసివస్తే కార్మికవర్గం అధికారంలో వున్న బ్రిటనే, సోవియట్ యూనియన్‌తోనూ, యితర ప్రజాతంత్ర దేశాలతోనూ మిత్రత్వాన్ని కలిగి తన వలస, బానిస దేశాల ప్రజలను విముక్తిచేసిన బ్రిటనే నిజమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను అనుభవించగలుగుతుంది.

"లేబరుమంత్లీ" ఆగష్టు 1949

స్టాలిన్

# నవంబరు విప్లవం*

# దాని అంతర్జాతీయ స్వభావం

[ నవంబరు విప్లవంయొక్క దశమ వార్షికోత్సవ సందర్భంలో ]

నవంబరు విప్లవం "జాతీయపరిమితుల్లో" జరిగిన వట్టి విప్లవం మాత్రమేకాదు. మానవజాతియొక్క ప్రపంచచరిత్రలో వచ్చిన మార్పును, పాతపెట్టుబడిదారీ ప్రపంచం నూతనసోషలిస్టు ప్రపంచంగా పరివర్తన చెందే మార్పును అది ప్రధానంగా సూచిస్తూఉంది; కాబట్టి అది ముఖ్యంగా అంతర్జాతీయ విప్లవం, ప్రపంచవిధానంలో వచ్చినవిప్లవం.

గతంలో జరిగిన విప్లవాలు ఒక దోపిడిముఠాస్థానంలో మరో దోపిడీముఠా ప్రభుత్వాన్ని వశపరుచుకోవడంతోనే సాధారణంగా సమాప్తమయ్యేవి. దోపిడిదార్లు మారేవాళ్ళు కాని దోపిడిమాత్రం అలాగే ఉండేది. బానిసల (స్లేవ్స్) విముక్తి ఉద్యమాల్లో ఇలాగే జరిగింది. దాసులు (సెర్ఫ్) తిరుగుబాట్లు జరిపిన సందర్భాల్లో (ఫ్యూడల్ యుగంలో – అనువాదకుడు) ఇలాగే జరిగింది. ఇంగ్లండ్, ఫ్రాన్సు జర్మనీదేశాల్లో వచ్చిన సుప్రసిద్ధ "మహత్తర" విప్లవాల్లో ఇలాగే జరిగింది. ఇందులో నేను ప్యారిస్ కమ్యూన్‌ను పేర్కొనడం లేదు. పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా చరిత్రను మార్చడానికి శ్రామికవర్గం ప్రప్రథమంగా చేసిన మహత్తర వీరోచిత ప్రయత్నమే ప్యారిస్ కమ్యూన్ కాని ఆ ప్రయత్నం విఫలమయింది.

---

* ఆనాటి రష్యన్ క్యాలండరు ఇప్పుడుమనం వాడేక్యాలండరుకు 13 రోజులు వెనకఉండేది. 1917 మార్చి విప్లవం ఆనాటి రష్యన్ క్యాలండరుప్రకారం ఫిబ్రవరిలో జరిగింది. అందువల్ల దానిని "ఫిబ్రవరి విప్లవం" అంటారు. ఆదేవిధంగా 1917 నవంబరులో జరిగిన విప్లవం ఆ క్యాలండరుప్రకారం "అక్టోబరువిప్లవం" అవుతుంది. రష్యాలో కూడా ఇప్పుడు పాతక్యాలండరు స్థానంలో కొత్తక్యాలండరునే వాడుతూ ఉన్నారు.

— సంపాదకవర్గం – జనత

నవంబరు విప్లవానికీ, పై జెప్పిన విప్లవాలకీ అసలుసిద్ధాంతంలోనే భేదముంది. నవంబరు విప్లవంయొక్క ఆశయం ఒకదోపిడి రూపాన్ని మార్చి ఆ స్థానంలో మరోదోపిడిరూపాన్ని ప్రవేశపెట్టడంకాదు. ఒక దోపిడిముఠా స్థానంలో మరోదోపిడి ముఠాను ప్రవేశపెట్టడంగాదు. ఒక మనిషిని మరోమనిషి దోచుకొనే దోపిడినంతటినీ తుడిచిపెట్టి వేయడమే, దోపిడిముఠాలన్నిటినీ తుడిచిపెట్టివేయడమే శ్రామిక నియంతృత్వాన్ని నెలకొల్పడమే, నేటివరకూ ఉన్న పీడితవర్గాలన్నిటికంటె అత్యంత విప్లవాత్మక వర్గమైన శ్రామికవర్గాధికారాన్ని నెలగొల్పడమే నూతన, వర్గరహిత, సోషలిస్టు సమాజాన్ని నిర్మించడమే నవంబరు విప్లవంయొక్క ఆశయం.

కాబట్టి, ఇదే కారణంవల్ల నవంబరు విప్లవంయొక్క విజయం మానవజాతి చరిత్రలో ఒక గొప్పమార్పును, పెట్టుబడదారీ విధానం యొక్క చారిత్రక లక్ష్యంలో గొప్పమార్పును, ప్రపంచ శ్రామికవర్గం యొక్క విముక్తి ఉద్యమంలో గొప్ప మార్పును, ప్రపంచమంతటా పీడిత ప్రజాసామాన్యంయొక్క పోరాట పద్ధతుల్లో, నిర్మాణరూపాల్లో జీవితంలో, సాంప్రదాయాల్లో, సంస్కృతిలో, సిద్ధాంతంలో గొప్ప మార్పును నవంబరు విప్లవం ముఖ్యంగా సూచిస్తూ ఉంది.

నవంబరు విప్లవం, అంతర్జాతీయ విప్లవ, ప్రపంచ విధానంలో విప్లవం కావడానికి ఇదే మూలకారణం.

నవంబరు విప్లవాన్ని తమ విముక్తికి ప్రమాణపత్రం (ప్లెడ్జి) గా ఎంచి ఆనందించిన సమస్త దేశాల పీడితవర్గాలూ ఆ విప్లవంపట్ల సానుభూతిని ప్రకటించడానికికూడా ఇదే మూలకారణం.

ప్రపంచమంతటా విప్లవోద్యమం యొక్క అభివృద్ధిపై నవంబరు విప్లవ ప్రభావం ఎంతిగా పనిందో చూపడానికి అనేక ప్రధాన సమస్యలను తీసుకోవచ్చు.

1. నవంబరు విప్లవం ముఖ్యంగా ప్రపంచ పెట్టుబడిదారీ సంఘటనలో గండిగొట్టింది. పెట్టుబడిదారీ దేశాల్లో పెద్దదైన ఒక దేశంలో సామ్రాజ్యవాద బూర్జువావర్గాన్ని కూలద్రోసి సోషలిస్టు

శ్రామికవర్గాన్ని ప్రభుత్వాధికారంలోకి తెచ్చింది. కాబట్టి నవంబరు విప్లవం గణనీయమైనది.

కూలిపని చేసుకొనే శ్రామికవర్గమూ, పీడితవర్గమూ, అణచబడే దోపిడిచేయబడేవర్గమూ, మొట్టమొదటిసారిగా మానవజాతి చరిత్రలో పాలక వర్గ స్థానాన్ని ఆక్రమించి సమస్తదేశాల శ్రామికులకు అనుసరణీయమైన మార్గాన్ని చూపించాయి.

నూతన యుగంలో, సమ్రాజ్యవాద దేశాల్లో శ్రామిక విప్లవాల యుగంలో నవంబరు విప్లవం దారిచూపింది.

భూస్వాములనుంచీ, పెట్టుబడిదారులనుంచీ ఉత్పత్తి పరికరాలనూ, సాధనాలనూ స్వాధీనపరచుకొని వాటిని ప్రజల ఆస్తిగా మార్చింది ఆవిధంగా బూర్జువా ఆస్తికి సోషలిస్టు ఆస్తిని పోటీగా నిలిపింది. దీనిద్వారా బూర్జువా ఆస్తి అనుల్లంఘనీయమనూ, పవిత్రమూ శాశ్వతమూ అని పెట్టుబడిదారులు చెప్పే అబద్ధాన్ని బట్టబయలు చేసింది

నవంబరు విప్లవం బూర్జువావర్గంనుంచి అధికారాన్ని గుంజుకుంది. బూర్జువా వర్గానికి రాజకీయ హక్కులు లేకుండాచేసింది. బూర్జువా రాజ్యాంగయంత్రాన్ని ధ్వంసంచేసి అధికారాన్ని సోవియట్ల హస్తగతంచేసింది. ఆవిధంగా పెట్టుబడిదారీ ప్రజాతంత్రమైన బూర్జువా పార్లమెంటరిజానికి వ్యతిరేకంగా శ్రామిక ప్రజాతంత్రమైన సోవియట్ల సోషలిస్టు పరిపాలన నెలకొల్పింది. విప్లవానంతరం వెంటనే "అదివరకు పెట్టుబడదారుగా వున్నవాళ్ళందరికీ వోటింగుహక్కు లేకుండాచేయబడుతుంది." అని ఎప్పుడో 1887 లో లాఫర్గ్ చెప్పినది యథార్థం. బూర్జువా పార్లమెంటరిజంద్వారా శాంతియుతంగా సోషలిజానికి పరివర్తన జరగడం ప్రస్తుతం సంభవమే అని సోషల్ డెమాక్రాట్లుచెప్పే అబద్ధాన్ని నవంబరు విప్లవం దీనిద్వారా బట్టబయలు చేసింది.

నవంబరు విప్లవం అంతటితోనే ఆగలేదు. ఆగజాలదు. పాత బూర్జువా విధానాన్ని ధ్వంసంచేసి నూతన సోషలిస్టు విధానాన్ని నిర్మించ ప్రారంభించింది. నవంబరు విప్లవం తర్వాత గడచిన పదిసంవత్సరాలూ పార్టీ, ట్రేడ్ యూనియన్లు, సోవియట్లు, కోపరేటివ్ సొసైటీలు,

వైజ్ఞానిక సంఘాలూ, రవాణాలూ, పరిశ్రమలూ, రెడ్ ఆర్మీ, నిర్మాణాని సంబంధించిన పది సంవత్సరాలు నిర్మాణరంగంలో సోవియట్ యూనియన్ సాధించిన సర్వోవాదమ్మైన సోషలిస్టు విజయాలు బూర్జువా వర్గం లేకుండా బూర్జువావర్గానికి వ్యతిరేకంగా శ్రామికవర్గం దేశాన్ని జయప్రదంగా పరిపాలించగలదని నిరూపించాయి. బూర్జువా వర్గం లేకుండా బూర్జువావర్గానికి వ్యతిరేకంగా జయప్రదంగా పరిశ్రమలను నిర్మించగలదని నిరూపించాయి. బూర్జువావర్గం లేకుండా, బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా, మొత్తం జాతీయ ఆర్థిక విధానాన్ని అంతటినీ జయప్రదంగా నడిపించగలదని నిరూపించాయి చుట్టూ పెట్టుబడిదారీ దేశాల ముట్టడి ఉన్నప్పటికీ జయప్రదంగా సోషలిజాన్ని నిర్మించగల దని నిరూపించాయి. పొట్ట లేకుండా తల మొదలైన ఇతర శరీరావయవాలు ఏమీ చేయలేనట్లే దోపిడిదార్లు లేకుండా దోపిడిచేయబడే వాళ్ళు ఏమీ చేయలేరనే పాత 'సిద్ధాంతాన్ని' పట్టుకొని ఊగులాడిన వాళ్ళల్లో ప్రాచీన చరిత్రకు చెందిన సుప్రసిద్ధ రోమన్ సెనేటరు అయిన మెనియస్ అగ్రిప్పా ఒక్కడే కాదు ఇంకా కొందరుకూడా ఉన్నారు. సోషల్ డెమాక్రసీయొక్క 'తత్వ శాస్త్రానికి' సర్వసాధారణంగాను, సామ్రాజ్యవాద బూర్జువావర్గంతో చేతులుకలిపే (కొాయలిషన్) సోషల్ డెమాక్రటిక్ పాలసీకి ప్రత్యేకంగాను ఇప్పుడు ఈ సిద్ధాంతమే పునాదిరాయి. వైషమ్య స్వభావంతో కూడుకొనిన ఈ 'సిద్ధాంతం' పెట్టుబడిదారీ దేశాల శ్రామికవర్గాన్ని విప్లవాత్మకంగా చేసే మార్గంలో ఇప్పుడు తీవ్రమైన ఒక ప్రతిబంధకంగా ఉంది. నవంబరు విప్లవం ఈ తప్పుడు 'సిద్ధాంతాన్ని' చావు దెబ్బ కొట్టింది. నవంబరు విప్లవం సాధించిన ముఖ్యమైన ఫలితాల్లో ఇది ఒకటి.

పెట్టుబడిదారీదేశాల్లోని కార్మికవర్గం సాగించే విప్లవోద్యమంపై నవంబరు విప్లవంయొక్క పై ఫలితంలాంటి ఫలితాలప్రభావం తీవ్రంగా పడకుండా ఉండజాలదని వేరే ఇంకా రుజువుచేయవలసిన అవసరం ఉందా ?

పెట్టుబడిదారీ దేశాల్లో కమ్యూనిజంయొక్క అభ్యుదయ పరంపరాభివృద్ధి, సోవియట్ యూనియన్ కార్మికవర్గంపట్ల పెరుగుతూవున్న

సమస్తదేశాల శ్రామికవర్గ సానుభూతి సోవియట్లు భూమికి వచ్చే అనేక కార్మిక ప్రతినిధివర్గాలూ నవంబరు విప్లవం నాటిన బీజాలు ఇదివరకే ఫలించసాగాయి అని నిస్సందేహంగా ఋజువుచేస్తున్నాయి

2. నవంబరు విప్లవం సామ్రాజ్యవాదాన్ని దాని అధికార కేంద్రాల్లో మాత్రమే, "మాతృదేశాల్లో" (సామ్రాజ్యవాద దేశాల్లో అనువాదకుడు) మాత్రమే, ఊగించివేయడం కాకుండా సామ్రాజ్యవాదానికి వెనకభాగాలను సైతం, దాని బాహ్యపరిమితులను సైతం దెబ్బకొట్టింది. వలసదేశాల్లో, పరతంత్రదేశాల్లో సామ్రాజ్యవాద పరిపాలనను బలహీనపరిచింది.

భూస్వాములను, పెట్టుబడిదారులను కూలద్రోయడంతో నవంబరు విప్లవం కానిస బంధనాలను తెగ్గొంచివేసి జాతీయ పీడననుంచీ, వలస పీడననుంచీ ఒక విశాలరాజ్యానికి చెందిన జాతులన్నిటినీ, ఎట్టి మినహాయింపు లేకుండా, విముక్తం చేసింది. అణచబడే జాతులను విముక్తం చేయకుండా శ్రామికవర్గం ముందు తనను విముక్తం చేసుకోజాలదు. జాతులమధ్య జాతీయ వైషమ్యమూ, వైరుధ్యమూ, రేకెత్తించే పతాకక్రింద గాకుండా, సోవియట్ యూనియన్‌లో వున్న వివిధ జాతులకు చెందిన కార్మికుల్లో, రైతుల్లో, పరస్పరవిశ్వాసమూ, సౌభ్రాతృత్వమూ, సౌహార్ద్రభావమూ సాధించే పతాకక్రింద; జాతీయత పేరుమీదటగాకుండా అంతర్జాతీయత పేరుమీదట నవంబరు విప్లవం సోవియట్ యూనియన్‌లో జాతీయ – వలసవిప్లవాలను సాధించింది. ఇది నవంబరు విప్లవంయొక్క స్వాభావికలక్షణం.

శ్రామికవర్గ నాయకత్వాన, అంతర్జాతీయ పతాకక్రింద, మన దేశంలో జాతీయ – వలసవిప్లవాలు జరిగినందువల్లనే పెరియా (వెనకబడిన) జాతులు స్లావ్ జాతులు మానవజాతి చరిత్రలో మొట్టమొదటి సారిగా నిజమైన స్వాతంత్రత నిజమైన సమానత గలిగిన జాతుల స్థానాన్ని ఆక్రమించాయి. దీనిద్వారా నవంబరు విప్లవం యావత్ ప్రపంచంలోని పీడితజాతులకు అనుసరణీయమైన మార్గాన్ని చూపింది.

అంటే నవంబరు విప్లవం శ్రామికవర్గ సమ్మేళనతో శ్రామికవర్గ నాయకత్వాన ప్రపంచంలోని అణచబడిన దేశాల్లో సాగించబడుతూవున్న

వలస విప్లవాలయుగాన్ని – ఒక నూతన యుగాన్ని – ప్రారంభించింది. తక్కువ తెగలు, ఎక్కువ తెగలు అని, నల్లతెగలు తెల్లతెగలుఅని ప్రపంచం అనాదినుంచి రెండుగా విభజించబడిందనీ, నల్లతెగలు నాగరికతకు అర్హమైనవి కావనీ, ఆ తెగలు దోపిడీకు గురికావడంతప్పని సరి అనీ, తెల్లతెగలు మాత్రమే నాగరికతకు సాధనాలనీ, తెల్లతెగలు నల్లతెగలను దోపిడీచేయడం విధివిధానమనీ అనుకోడం ఇదివరకు "అంగీకృతభావం"గా ఉండేది. ఇప్పుడీకథను ఒకపుక్కిటిగాథగా త్రోసి వేయవలసి ఉంటుంది. నవంబరు విప్లవం సాధించిన అత్యంత ప్రధాన ఫలితాల్లో ఈ పుక్కిటిగాథను చావుదెబ్బకొట్టడం ఒకటి. విముక్తం చేయబడి సోవియట్ అభివృద్ధిమార్గంలో అడుగుబెట్టిన నాన్‌యూరోపి యన్ జాతులు నిజమైన అభ్యుదయ సంస్కృతిని పెంపొందింప జేయ డంలోగానీ, నిజమైన అభ్యుదయకర నాగరికతను పెంపొందింప జేయ డంలోగానీ యూరోపియన్ జాతులకంటె ఒక్క పిసరుకూడా తీసి పోవని నవంబరు విప్లవం నిరూపించింది.

అణచబడిన జాతులను విముక్తంచేయడానికి బూర్జువా జాతీయత ఒక్కటే ఏకైకపద్ధతిఅని అనుకోడం ఇదివరకు "అంగీకృతభావం"గా ఉండేది. ఆ పద్ధతి ఒకజాతినుంచి మరోజాతిని దూరంచేసే పద్ధతి. జాతు లను చీల్చేపద్ధతి. వివిధజాతులకు చెందిన కష్టజీవులైన ప్రజాసామా న్యాలో జాతీయ వైషమ్యాన్ని తీవ్రతరంచేసేపద్ధతి. ఇది విఫలమైన పద్ధతిగా ఇప్పుడు దీన్ని త్రోసివేయవలసి ఉంటుంది. ఈపద్ధతిని – ఈ పుక్కిటిగాథను నవంబరు విప్లవం చావుదెబ్బకొట్టింది. ఆ విప్లవం సాధించిన అత్యంతప్రధాన ఫలితాల్లో ఇదిఒకటి. శ్రామికవర్గ, అంతర్జాతీయ పద్ధతి ఒక్కటే అణచబడిన జాతులను విముక్తం చేయడానికి సరియైన పద్ధతిఅని, దాని సాధ్యతనూ ఆవశ్యకతనూ నవంబరు విప్లవం ఆచర ణలో నిరూపించింది. యథేచ్ఛ, అంతర్జాతీయత అనే సూత్రాలపై పూర్తిగా విభిన్నజాతులకు చెందిన కార్మికుల రైతుల సౌహార్ద్రసంఘం యొక్క సాధ్యతనూ ఆవశ్యకతనూ నవంబరు విప్లవం ఆచరణలో నిరూపించింది. ఒకేఒక ప్రపంచ ఆర్థిక విధానంలో సమస్తదేశాల కార్మికప్రజలు భవిష్యత్తులో కలిసి ఉండడానికి ఆదర్శప్రాయంగా

(ప్రొటోటైప్) ఉండే సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్స్ యూనియన్ యొక్క ఉనికియే ఒక ప్రత్యక్ష నిదర్శనంగా ఉపయోగిస్తుంది.

నవంబరు విప్లవంయొక్క ఈ ఫలితంలాంటి ఫలితాలే వలస దేశాల, బానిసదేశాల విప్లవోద్యమంపై తీవ్రమైన ప్రభావాన్ని కలిగించకుండా వుండవని, వుండజాలవని వేరే చెప్పనవసరంలేదు.

వలసదేశాలనూ పరతంత్ర దేశాలనూ కడుపులో చల్ల కదల కుండా దోపిడిచేసే, అణచివేసేయుగం గడచిపోయింది.

వలసదేశాల్లోనూ, పరతంత్రదేశాల్లోనూ విముక్తికోసం విప్లవాలు జరిగే యుగం, శ్రామికవర్గం మేల్కొనేయుగం, విప్లవాల్లో శ్రామికవర్గమే నాయకత్వం వహించేయుగం ప్రారంభమయింది.

3. సామ్రాజ్యవాద కేంద్రాల్లోనూ, వాటి వెనకభాగాల్లోనూ విప్లవ బీజాలు నాటడంవల్ల, "మాతృదేశాల్లో" సామ్రాజ్యవాదశక్తిని బలహీనపరచడంవల్ల, వలసదేశాల్లో సామ్రాజ్యవాదుల అధికారాన్ని ఊగించివేయడంవల్ల, నవంబరు విప్లవం ప్రపంచ సామ్రాజ్యవాద అస్తిత్వాన్నే మొత్తంగా ప్రమాదానికి గురిచేసింది.

పెట్టుబడిదారీ విధానంలో వున్న అసమానతవల్ల, పెట్టుబడిదారీ విధానంలో వైరుధ్యాలూ, సాయుధ సంఘర్షణలూ అనివార్యం కావడంవల్ల, ఇదివరకెన్నడూ కనీ వినీ ఎరుగని సామ్రాజ్యవాద హత్యాకాండవల్లా, సామ్రాజ్యవాద పరిస్థితుల్లో పెట్టుబడిదారీవిధానం స్వయంస్ఫూర్తిగా (స్పాంటేనియస్‌గా) అభివృద్ధిచెందడం పోయి క్షీణ దశలో, మరణదశలో ప్రవేశించింది. ఈ గమనాన్ని నవంబరువిప్లవం ప్రపంచ పెట్టుబడిదారీ విధానంనుంచి ఒక పెద్దదేశం విడిపోయిన ఫలితంగా యింకా తీవ్రతరం చేస్తుంది. ప్రపంచ సామ్రాజ్యవాద పునాదులనే ఒక్కొక్కటిగా కూలద్రోస్తుంది.

ఇంతేకాకుండా, సామ్రాజ్యవాదాన్ని ఊపివేయడంతోపాటు నవంబరు విప్లవం మొట్టమొదటి శ్రామికవర్గ నియంతృత్వంలో ప్రపంచ విప్లవోద్యమానికి ఒకబలమయిన ప్రాతిపదికను నిర్మించింది. ప్రపంచ విప్లవోద్యమానికిఇదివరకెన్నడూ ఇలాంటి ప్రాతిపదిక లభించలేదు. ఈ ప్రాతిపదికపై నేడు ప్రపంచ విప్లవోద్యమం ఆధారపడగలుగుతుంది.

ప్రపంచ విప్లవోద్యమానికి ఇదివరకెన్నడూ లేనటువంటి బలమైన ఒక బహిరంగ కేంద్రాన్ని నవంబరు విప్లవం నిర్మించింది. ఇప్పుడీ కేంద్రాన్ని ఆధారంగా చేసుకొని దీనిచుట్టూ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా అణచబడిన జాతులయొక్క, శ్రామికులయొక్క ఐక్య విప్లవాత్మక సఘంటనను సమీకరించ గలుగుతుంది, నిర్మించగలుగుతుంది.

అంటే, దీని అర్థం ప్రథమంగా ప్రపంచ పెట్టుబడిదారీ విధానాన్ని నవంబరు విప్లవం చావుదెబ్బ కొట్టింది. ఈ దెబ్బనుంచి ఇక అది ఎప్పటికీ కోలుకోలేదు. అందువల్లనే పెట్టుబడిదారీ విధానం నవంబరుకు పూర్వమున్న 'సమానత' ను "స్థిరత్వాన్ని" మళ్ళీ ఎన్నటికీ సాధించలేదు. పెట్టుబడిదారీ విధానంలో కొంతవరకు స్థిరత్వం ఏర్పడ వచ్చును. తక్కువమంది కార్మికులతో ఎక్కువపని చేయించడంద్వారా ఉత్పత్తిని నిలబెట్టుకోవచ్చును. పరిపాలనను ఫాసిజంలోకి మార్చవచ్చును. తాత్కాలికంగా కార్మికవర్గాన్ని అణచి వుంచవచ్చును. కాని నవంబరువిప్లవానికి పూర్వమున్న "ప్రశాంతత" ను "హామీ"ని "సమానత" ను "స్థిరత్వాన్ని" పెట్టుబడిదారీ విధానం మళ్ళీ ఎన్నటికీ సాధించలేదు. ఎందుకంటే, ప్రపంచ పెట్టుబడిదారీ విధానం సంక్షోభం అలాంటి అభివృద్ధి దశను చేరుకుంది. ఇక ఆ దశలో విప్లవజ్వాలలు తప్పనిసరిగా ప్రజ్వలించక మానవు. ఒకప్పుడు సామ్రాజ్యవాద కేంద్రాల్లో, మరొకప్పుడు వాటి సరిహద్దు ప్రదేశాల్లో (పెరిఫెరీ) అజ్వాలలు ప్రజ్వలిస్తూనే ఉంటాయి. అజ్వాలల్లో పెట్టుబడిదారీ అతుకుల బొంతలు ఎక్కడికక్కడ తునాతునకలై పోతాయి. తద్వారా పెట్టుబడిదారీ విధానం రోజురోజుకూ పతనమై పోతుంది. సరిగ్గా కొంగకథలో చెప్పినట్లుగా "బురదలోనుంచి అది ఒకవైపున తన తోకను బైటికిలాగితే మరోవైపు దానిముక్కు బురదలో కూరుకొని పోతుంది ముక్కును బైటికి లాగితే తోక బురదలో దిగబడుతుంది."

ఇక రెండోవిషయం, యావత్ ప్రపంచ పీడితవర్గాలను ఒక నూతనమైన ప్రధానశక్తిగా పరిపాలకవర్గాలు గుర్తించి తీరవలసినంతగా నవంబరు విప్లవం ఆవర్గాల బలాన్ని తదితరవర్గాలతో పోల్చినప్పుడు

ఆ వర్గాల ప్రాముఖ్యతనూ ఆ వర్గాల ధైర్యసాహసాలనూ పోరాట
సంసిద్ధతనూ పెంపొందించింది. కష్టజీవులైన ప్రపంచ ప్రజాసామా
న్యాన్ని నిరాశోపహతమై చీకటిలో తడుములాడే ఒక "గుడ్డిమూక"గా
ఇంకెంతమాత్రమూ త్రోసివేయడం జరగదు. ఎందుకంటే నవంబరు
విప్లవం ఒక జ్యోతిని వెలిగించింది. ఆజ్యోతియే వెలుగునిచ్చి వారికి
దారిచూపుతుంది. పీడితవర్గాల ఆశయాలనుగురించి పోరాటాలను
గురించి క్షుణ్ణంగా చర్చించి సిద్ధాంతీకరించడానికి ప్రపంచమంతటికి సంబం
ధించిన ఒక బహిరంగ వేదిక అంటూ ఇంతవరకేదీ లేదు. కాని ఇప్పుడు
మొట్టమొదటి శ్రామిక నియంతృత్వంలో అలాంటి బహిరంగ వేదిక
ఏర్పడింది. ఈ వేదికను భగ్నం చేయడం అంటే "పురోగమించిన
దేశాల" సాంఘిక రాజకీయ జీవితంపై చాలాకాలంవరకు వచ్చి అభి
వృద్ధినిరోధకతత్వం విచ్చలవిడిగా ఆవరిస్తుంది అనడంలో ఎట్టి సందేహం
లేదు. "బోల్షివిక్ ప్రభుత్వం" యొక్క వునికియే కరుడుగట్టిన అభి
వృద్ధి నిరోధకశక్తులకు ఒక ప్రతిబంధకం అనే విషయాన్ని త్రోసిపుచ్చ
డానికి వీల్లేదు. "బోల్షివిక్ ప్రభుత్వం"యొక్క ఉనికియే విముక్తికోసం
అణచబడిన వర్గాలు సాగించే పోరాటంలో సహాయకారిగా ఉంటుంది.
వివిధదేశాల దోపిడిదార్లు బోల్షివిక్కులపట్ల ఎందువల్ల తీవ్రమైన
ద్వేషాన్ని ప్రకటిస్తూవున్నారో ఈవిషయమే నిజంగా విశదీకరిస్తుంది.
ప్రాతిపదిక నూతనమైనా చరిత్ర పునరావృత్తమవుతుంది. ఇదివరకు,
ఫ్యూడలిజం క్షీణదశలో వున్నప్పుడు "జాకోబిన్" అనేశబ్దం అన్ని దేశాల
పాలకవర్గాల్లో భయమూ ఆగ్రహమూ కలిగించింది. సరిగా అదే
విధంగా ఇప్పుడు, పెట్టుబడిదారీ విధానం క్షీణిస్తూవున్న దశలో అన్ని
దేశాల పెట్టుబడిదారుల్లో "బోల్షివిక్" అనే శబ్దం భయం, ఆగ్రహం
కలిగిస్తూవుంది. ఆనాడు పురోగమిస్తూవున్న బూర్జువా వర్గంయొక్క
విప్లవ ప్రతినిధులకు ప్యారిస్ పట్టణం శరణాలయం విద్యాలయం అయి
నట్లే నేడు పురోగమిస్తూ వున్న శ్రామికవర్గంయొక్క విప్లవ ప్రతినిధు
లకు మాస్కో శరణాలయంగా విద్యాలయంగా వుంటూవుంది. జాకో
బిన్లపై ద్వేషం ఫ్యూడలిజాన్ని పతనంగాకుండా కాపాడలేకపోయింది.
బోల్షివిక్కులపై ద్వేషంకూడా పెట్టుబడిదారీ విధానం తప్పనిసరిగా

భగ్నం కాకుండా దానిని కాపాడలేదనడానికి ఏమైనా సందేహం ఉందా ?

పెట్టుబడిదారీ విధానంలో "స్థిరత్వం" యొక్క యుగం గడచిపోయింది. పెట్టుబడిదారీ విధానం ఎన్నటికీ శల్యంలేనిది అనే పుక్కిటి గాథకూడా దానితోనే అంతరించిపోయింది.

పెట్టుబడిదారీ విధానం భగ్నమై పోతూవున్న యుగం ప్రారంభమయింది.

4. నవంబరు విప్లవం ఆర్థిక సాంఘిక రాజకీయ సంబంధాల విషయంలో మాత్రమే జరిగిన విప్లవం కాదు. అది కార్మికుల మానసిక ప్రవృత్తిలో జరిగిన విప్లవం. కార్మికుల సిద్ధాంతంలో జరిగిన విప్లవం. మార్క్సిజం పతాకక్రింద, శ్రామిక నియంతృత్వం అనే భావం యొక్క పతాకక్రింద, సామ్రాజ్యవాద యుగంలో, శ్రామిక విప్లవాల యుగంలో మార్క్సిజం అయిన లెనినిజంయొక్క పతాకక్రింద నవంబరు విప్లవం పుట్టింది. బలపడింది. అందువల్ల ఆ విప్లవం సంస్కరణ వాదంపై మార్క్సిజంయొక్క విజయాన్ని, సోషల్ డెమాక్రటిజంపై లెనినిజంయొక్క విజయాన్ని, రెండవ ఇంటర్నేషనల్‌పై మూడవ ఇంటర్నేషనల్‌యొక్క విజయాన్ని సాధించింది.

మార్క్సిజానికి సోషల్ డెమాక్రటిజానికీ మధ్య, లెనినిజం పాలసీకీ సోషల్ డెమాక్రటిజం పాలసీకీ మధ్య, నవంబరువిప్లవం దాటరాని గండిగొట్టింది. శ్రామిక నియంతృత్వం విజయాన్ని సాధించడానికి పూర్వం శ్రామిక నియంతృత్వం అనే భావాన్ని సోషల్ డెమాక్రసీ బహిరంగంగా ఖండించకుండా ఉండేది. అంతే కాని శ్రామికవర్గ నియంతృత్వాన్ని గుర్తింపజేయడానికి అది పాటుపడేది కాదు. ఏమాత్రం పాటుపడేదికాదు. కాని మార్క్సిజంయొక్క పతాకనుమాత్రం ప్రదర్శించేది. ఎందుకంటే ఈ ప్రదర్శనం – సోషల్ డెమాక్రసీయొక్క ఈ ప్రవర్తన పెట్టుబడిదారీ విధానానికి ఎట్టి ప్రమాదాన్నీ కలిగించేదికాదు. అప్పుడు ఆ కాలంలో, సోషల్ డెమాక్రసీ మార్క్సిజంతో మిళితమయ్యే ఉండేది; లేక దాదాపు మిళితమై ఉండేది. ఇక ఇప్పుడో, శ్రామికవర్గం జయించిన తర్వాత, మార్క్సిజం ఎక్కడకు దారితీస్తుందో దాని విజయం

ఎట్టి ప్రాముఖ్యతను సూచిస్తుందో, అందరికి విస్పష్టంగా తెలిసిరావడంతో సోషల్ డెమాక్రసీ ఇంకెంతమాత్రం మార్క్సిజం పతాకను ప్రదర్శించలేదు. పెట్టుబడిదారీ విధానానికి కొంత ప్రమాదం కలిగించకుండా సోషల్ డెమాక్రసీ శ్రామికవర్గ నియంతృత్వం అనే భావంపై తనకు ప్రేమ ఉన్నట్లుగా ఇంకెంతమాత్రం నటించలేదు. మార్క్సిజం యొక్క చైతన్యం (స్పిరిట్) నుంచి ఏనాడో దూరమైపోయిన సోషల్ డెమాక్రసీ మార్క్సిజంయొక్క పతాకను కూడా నిరాకరించవలసిన పరిస్థితిలో పడింది. మార్క్సిజంయొక్క ఫలితానికి వ్యతిరేకంగా, నవంబరు విప్లవానికి వ్యతిరేకంగా, ప్రపంచంలోని మొట్టమొదటి శ్రామిక వర్గ నియంతృత్వానికి వ్యతిరేకంగా, అది బహిరంగంగా నిస్పష్టమైన వైఖరి నవలంబించింది. అది ఇప్పుడు మార్క్సిజంనుంచి దూరమై తీరాలి. వాస్తవంగా అది మార్క్సిజంనుంచి దూరమయింది. ఎందుకంటే, నేటి పరిస్థితుల్లో ప్రపంచంలోని మొట్టమొదటి శ్రామికవర్గ నియంతృత్వాన్ని బహిరంగంగా మనస్ఫూర్తిగా సమర్థించకుండా, తన దేశంలోని బూర్జువావర్గానికి వ్యతిరేకంగా విప్లవ పోరాటం కొనసాగించకుండా, తన దేశంలో శ్రామికవర్గ నియంతృత్వం విజయాన్ని సాధించడానికి అనుకూల పరిస్థితులను కల్పించకుండా, ఏ వ్యక్తి తాను ఒక మార్క్సిస్టునని అనుకోలేడు. సోషల్ డెమాక్రసీకీ మార్క్సిజానికి మధ్య ఒక అఖాతం ఏర్పడింది. అందువల్ల లెనినిజమాత్రమే కమ్యూనిజం మాత్రమే మార్క్సిజానికి కోట, సాధన.

ఇంతటితోనే విషయాలు పూర్తికాలేదు, సోషల్ డెమాక్రసీకీ మార్క్సిజానికీ మధ్య గీత గీయడంతో నవంబరు విప్లవం ఆగిపోలేదు, అది ఇంకా ముందుకు సాగిపోయింది. సోషల్ డెమాక్రసీని ప్రపంచంలోని మొట్టమొదటి శ్రామికవర్గ నియంతృత్వానికి వ్యతిరేకంగా పెట్టుబడిదారీ విధానాన్ని ఖచ్చితంగా బలపరిచేవాళ్ళ శిబిరంలోకి త్రోసిపుచ్చింది. అడ్లర్, బామెర్, వెల్స్, లెవీ, లాంగెట్, బ్లుంలాంటివాళ్ళు 'సోవియట్ పరిపాలన'ను నిందిస్తూవున్నారు. పార్లమెంటరీ "ప్రజాతంత్రాన్ని" తెగపొగుడుతున్నారు. అంటే సోవియట్ యూనియన్‌లో పెట్టుబడిదారీ విధానాన్ని పునస్థాపించడానికీ, "నాగరిక" దేశాల్లో

పెట్టుబడిదారీ బానిసత్వాన్ని నిలబెట్టడానికే ఈపెద్దలు పోరాడుతున్నారనీ ముందుకూడా పోరాడుతూనే ఉంటారనీ దీనిఅర్థం. నేటి సోషల్ డెమాక్రటిజం పెట్టుబడిదారీ విధానానికి ఒక సిద్ధాంతకవచం. నేటి సోషల్ డెమాక్రటిక్ రాజకీయవేత్తలు "కార్మికోద్యమంలో బూర్జువావర్గానికి నిజమైన ఏజెంట్లు; పెట్టుబడిదారీ వర్గానికి కార్మిక ఉపగ్రహాలు." "శ్రామికవర్గానికీ బూర్జువావర్గానికీ మధ్యజరిగే అంతర్యుద్ధం"లో "కమ్యూనార్డ్స్‌కు వ్యతిరేకంగా వర్సెలీను పక్షాన" నిలబడతారు. అని లెనిన్ చెప్పినమాట ముమ్మాటికీ సత్యం. కార్మికోద్యమంలో సోషల్ డెమోక్రటిజాన్ని అంతమొందించకుండా పెట్టుబడిదారీ విధానాన్ని అంతమొందించడం అసంభవం. కాబట్టి మరణాసన్నమైన పెట్టుబడిదారీ విధానయుగమే కార్మికోద్యమంలో మరణాసన్నమైన సోషల్ డెమాక్రటిజంయొక్క యుగంకూడా. ప్రపంచ కార్మికోద్యమంలో సోషల్ డెమాక్రటిజంపై లెనినిజం తప్పనిసరిగా విజయాన్ని సాధిస్తుంది అనే వాస్తవికతలోనే నవంబరు విప్లవంయొక్క ప్రాముఖ్యత ఎంతోఉంది.

కార్మికోద్యమంలో రెండవ యింటర్నేషనల్‌యొక్క, సోషల్ డెమాక్రటిజం యొక్క, ప్రాబల్యయుగం ముగింపుకు వచ్చింది.

లెనినిజం యొక్క, మూడవ ఇంటర్నేషనల్‌యొక్క ప్రాబల్య యుగం ప్రారంభమైంది.

(ప్రవద, నం. 255, నవంబరు 6-7, 1927 "ప్రాబ్లెమ్స్ ఆఫ్ లెనినిజం" నుంచి)

"నూతన ప్రజాతంత్ర సంస్కృతి ప్రజాదరణ గలిగిన, ప్రజల, ప్రజాతంత్రసంస్కృతి. ఈ సంస్కృతి నూటికి 90 మందిగా ఉన్న కష్టజీవులైన కార్మిక, కర్షకుల ప్రయోజనాలకోసం ఉపయోగించాలి. ఈ సంస్కృతి కష్టజీవుల సంస్కృతిగానే ఉండాలి."

—మావో - సె - టుంగ్



"పార్టీ ప్రజావాణిని బాగా చెవియొగ్గి వినాలి. ప్రజల విప్లవ తత్వాన్ని బహుశ్రద్ధగా గమనించాలి. ప్రజల పోరాటానుభవాన్ని అధ్యయనం చేయాలి. ఈ ప్రాతిపదికపై తాను అవలంబించే పాలసీ ఎంతవరకు సరియైనదో పరీక్షించుకోవాలి. తత్ఫలితంగా, పార్టీ ప్రజలకు బోధించడమే కాకుండా ప్రజల నుంచి నేర్చుకోవాలి."

స్టాలిన్

(ప్రోబ్లెమ్స్ ఆఫ్ లెనినిజం పేజి 144—145)



"కార్మికవర్గంయొక్క విశ్వాసంపైనే పార్టీ ప్రతిష్ఠ ఆధారపడి వుంటుంది. కార్మికవర్గ విశ్వాసం బలప్రయోగం ద్వారా సంపాదించబడలేదు. బలప్రయోగం విశ్వాసాన్ని చంపుతుంది గాని సంపాదించదు. పార్టీయొక్క సరియైన సిద్ధాంతమూ, పార్టీ అవలంబించే సరియైనపాలసీ, కార్మికవర్గం పట్ల పార్టీ ప్రకటించే శ్రద్ధాసక్తులూ కార్మికవర్గ ప్రజానీకంతో పార్టీయొక్క సన్నిహితసంబంధమూ, తన నినాదాలు ఎంత సవ్యమైనవో ప్రజానీకానికి నచ్చజెప్పడానికి పార్టీ కనపరచే సింసిద్ధతా, సమర్థతా – ఇవే కార్మికవర్గ విశ్వాసాన్ని సంపాదించాయి."

స్టాలిన్

(ప్రోబ్లెమ్స్ ఆఫ్ లెనినిజం పేజి 144)



# పౌండువిలువ తగ్గింపు

[ పౌండువిలువను తగ్గించవలసిందిగా బ్రిటిష్ ప్రభుత్వంపై అమెరికా అధికార వర్గాలు చాలరోజులుగా వొత్తిడి తెస్తున్నాయి. దీనికిగల కారణాలనూ, దాని వలన కలిగే ఫలితాలను వివరించవలసిందిగా ఒక పాఠకుడు ప్రశ్న పంపించగా ప్రఖ్యాత సోవియట్ వారపత్రిక "న్యూటైమ్సు" తన ఆగస్టు 24 వ తేదీ సంచికలో (35) జవాబును ప్రకటించింది.

ఈనాడు బ్రిటిష్‌ప్రభుత్వం అమెరికా వొత్తిడికి లొంగి తన పౌండు విలువను తగ్గించివేసింది. దానితో మన రూపాయవిలువను కూడా తగ్గించుతూ భారత ప్రభుత్వం ప్రకటించింది. ఈ సమస్యను 'జనత' పాఠకులు అర్థంచేసుకోనేందుకు సహాయపడుతుందనే అభిప్రాయంతో 'న్యూటైమ్సు' ప్రచురించిన ఆ వ్యాసాన్ని యీ క్రింద నిస్తున్నాం.

సంపాదకవర్గం ]

ప్రశ్న :

పౌండు విలువను తగ్గించవలసిందిగా లండన్ ప్రభుత్వ వర్గాలపై అమెరికా ప్రభుత్వం అదేపనిగా వొత్తిడి తెస్తున్నట్లుగా పత్రికలు ప్రకటిస్తున్నాయి. కాని 1930 ఆ ప్రాంతాలలో వాణిజ్యరంగంలో అమెరికాతో పోటీచేసేందుకే బ్రిటిష్ గుత్త పెట్టుబడిదారీవర్గాలు పౌండువిలువను తగ్గించడానికి ప్రయత్నించిన విషయాన్ని మీరు యీ సందర్భంలో జ్ఞప్తికి తెస్తున్నా. దానిని వివరించి తెలియజేయవలసిందిగా కోరుతున్నా.

యన్. సిడోరావ్ — బాకు

సమాధానం :

ప్రపంచ మార్కెట్టుకోసం కేపిటలిస్టు రాజ్యాల వాణిజ్యయుద్ధాల స్వభావంలో 1930 నాటితో పోల్చిచూస్తే నేడు చాల మార్పువచ్చినమాట వాస్తవమే. విపరీతమైన సంక్షోభానికి గురైన ఆనాడు పోటీదారులపై వొత్తిడితెచ్చి, తమ ఎగుమతుల వ్యాపారాన్ని యథాతథంగా కొనసాగించుకోనేందు కొరకే పెట్టుబడిదారీ రాజ్యాలు తమ కరెన్సీ నాణెముల విలువను తగ్గించినాయి. తక్కువ మారకపు రేట్లవల్ల పోటీరాజ్యాలనుండి సామాన్యంగా విపరీతమైన వ్యతిరేకత వస్తుంది. అంతకు ముందుగానే తన పౌండువిలువను తగ్గించిన బ్రిటన్ చర్యకుప్రతిగా 1934లో అమెరికా తన డాలర్ మారకపు రేటును తగ్గించవలసి వచ్చింది.

ఈనాడు మనం దానికి పూర్తిగా విభిన్నమైన పరిస్థితిని చూస్తున్నాం. ఈ సారి బ్రిటిష్ గుత్తపెట్టుబడిదారులు గాక అమెరికా పెట్టుబడిదారులే పౌండువిలువను తగ్గించవలసిందిగా అదేపనిగా వొత్తిడిని తెస్తున్నారు. పౌండువిలువ తగ్గినఫలితంగా పెరిగే బ్రిటిష్ ఎగుమతుల వ్యాపార

పోటీకి అమెరికా అసలు భయపడుతున్నట్లే కనపడటం లేదు.

ఆంగ్లో-అమెరికన్ వాణిజ్య యుద్ధపు ఎత్తుగడలలో వచ్చిన యీ ప్రధాన మార్పుకు కారణమేమంటే యీనాడు మార్కెట్లకోసం జరుగుతున్న పోరాటంలో ఎగుమతిచేసే వస్తువుల ధరలేకాక యింకా అనేక యితర శక్తులు ముఖ్యమైన పాత్రను నిర్వహిస్తాయి.

పౌండు విలువను తగ్గించాలని వాల్ స్ట్రీట్ ధనికవర్గాలు తెస్తున్న తీవ్రమైన ఒత్తిడి అసలే దెబ్బతిని చిన్నాభిన్నమవుతున్న బ్రిటన్ ఉత్పత్తి వాణిజ్యాలపై అమెరికా చేస్తున్న దాడిలో ఒక భాగం మాత్రమే. ఇక కొత్తగా విదేశమార్కెట్ల కోసం జరుగుతున్న వేటలో బ్రిటన్ కంటే అమెరికా పరిశ్రమలకే ఎక్కువ అనుకూలమైన అవకాశా లున్నాయి.

ఒకటి: అమెరికాలో టెక్నికల్ సంపదా, ఉత్పత్తి విధానం ఉన్నత స్థాయిని అందుకొన్నాయిగాబట్టిఅమెరికా కంపెనీలు కారుచౌకగా వస్తువులను తయారు చేయగలుగుతాయి. బ్రిటిషు కార్మికుడు ఒక గంటలో చేసే పని అమెరికా కార్మికుడు అరగంటలోనే పూర్తి చేయగలుగుతాడు. ఇది లండన్ ధనికవర్గాల కెప్పుడూ అసూయ కారణంగానే వస్తూవుంది.

రెండు: యుద్ధం అయిపోయినప్పటి నుండీ పెట్టుబడులను ఎగుమతిచేసే విషయంలో అమెరికా పూర్తి గుత్తాధికారాన్ని కలిగి వుంది. దీనిమూలకంగా అమెరికా వస్తువులకు విదేశ మార్కెట్లలో అత్యధికమైన అవకాశం వచ్చింది. ఉదాహరణకు 1948 వ సంవత్సరం ఆఖరి మూడుమాసాలలో అమెరికా వస్తువుల, సర్వీసుల ఎగుమతులలో నూటికి 40 వంతులకు (వీటి మొత్తం విలువ 8971 మిలియన్ల డాలర్లు) అమెరికా యే-ప్రభుత్వంద్వారా చెల్లించింది. ఇంక కొంత తక్కువస్థాయిలో ప్రయివేటు పెట్టుబడుల ఎగుమతులు జరిగాయి. ఈ రకమైన అమెరికా విస్తరణతో ప్రస్తుతం బ్రిటన్ తానున్న పరిస్థితులలో ఏమాత్రం పోటీ చేయలేదు.

మూడు: అమెరికాకు తగినంతగా స్వదేశ మార్కెట్టువుంది. అందువలన బ్రిటిష్ పోటీదారులకు అందకుండా అమెరికా గుత్తపెట్టుబడిదారులు తమ సరకులను స్వదేశమార్కెట్టులోనే గుప్పడానికి అవకాశంవుంది, అమెరికా గుత్తపెట్టుబడిదారీసంస్థలు బ్రిటిషు గుత్తపెట్టుబడిదారులకంటే అనేకరెట్లు అధికంగా సరకులను స్వీయమార్కెట్టులో అమ్ముతాయి. తన మొత్తం ఉత్పత్తిలో నూటికి 9 వంతులు మాత్రమే ఎగుమతి చేస్తుంది. బ్రిటన్ నూటికి 25 వంతులు ఎగుమతి చేస్తుంది. అందువలన స్వీయమార్కెట్టులో ధరలను పెంచి అమెరికా పరిశ్రమాధికారులు ఎగుమతులను అధీనంచేసేందుకు వెళ్లే వస్తువుల ధరలు తగ్గించుతారు. ఆ విధంగా వచ్చేనష్టాన్ని అమెరికా వినిమయదారుల నుండి పూడుస్తారు. బ్రిటిషు ఎగుమతిదారుల యిలాంటిపనిని చేసేస్థితిలో లేనే లేదు.

కాని ప్రస్తుత పరిస్థితిలోని విచిత్రమైన విషయమేమంటే అమెరికా యొక్క మంచిస్థితికి వున్న బలమైన కారణాలే దాని బలహీనతకు కూడా హేతువైనాయి. అమెరికా ఎగుమతులకు దిగుమతులకు విపరీతమైన తేడావుంది. దీనిఫలితంగా పెట్టుబడిదారీ ప్రపంచమంతటా డాలరు

కొరత ఏర్పడింది. బ్రిటన్ ఆర్థిక వ్యవస్థను దెబ్బ తీయడానికి కారణభూతమైన ఎగుమతులకంటే దిగుమతులే ఎక్కువగా వుండటం ఒకవిధంగా బ్రిటన్‌కు లాభకరమైన విషయమే.

ప్రధానమైన ఆహార పదార్థాలనూ, ముడిపదార్థాలను అధికంగా అమెరికా ఉత్పత్తి చేస్తుంది. బ్రిటన్ రెండింటినీ (ఆహారపదార్థాలను, ముడిపదార్థాలను) ఎక్కువగానే దిగుమతి చేసుకొంటుంది. నిజానికి కేపిటలిస్టు ప్రపంచంలోకెల్లా బ్రిటనే అధికంగా దిగుమతులను చేసుకొనేదేశం. అమెరికా తాను దిగుమతి చేసుకొనేదానికంటే దాదాపు రెట్టింపు ఎగుమతి చేస్తుంది. బ్రిటన్‌ను అమ్మేదానికంటే తాను విదేశ మార్కెట్టులనుండి కొనేదే చాల ఎక్కువ వుంటుంది.

ఎగుమతిచేసే పెట్టుబడిదారీ దేశాలలో అమెరికాదే అగ్రస్థానం. ఈ విషయంలో దానిది బ్రిటన్‌కంటే ఎంతో పైచేయి. ఈ సంవత్సరం మొదటి మూడుమాసాల్లో అమెరికా ఎగుమతుల విలువ మొత్తం 824 మిలియన్‌ల డాలర్లు. బ్రిటన్ ఎగుమతుల మొత్తం 1852 మిలియన్ డాలర్లు మాత్రమే. అదేకాలంలోని దిగుమతులను పరిశీలించితే బ్రిటన్‌దే ప్రథమస్థానం. బ్రిటన్ 2168 మిలియన్ డాలర్ల విలువగల సరకులను దిగుమతి చేసుకొన్నది. అదేకాలంలో అమెరికా దిగుమతులు 1767 మిలియన్ డాలర్ల విలువగలవి మాత్రమే.

బ్రిటన్‌కు యీవిధంగాఉన్న వాణిజ్య కొరత మూలంగానే ప్రపంచ మార్కెట్టులో దానికాస్థానం రావడం సంభవించింది. కాని ఇది విచిత్రసంఘటనగా కనపడినా, అదే అమెరికా పోటీ వొత్తిడిని ప్రతిఘటించడానికి బ్రిటనుకు ఒక ఆయుధమైంది.

తాను ఎగుమతులు చేస్తున్న దేశాల నుండి వచ్చే దిగుమతులను అమెరికా విపరీతంగా తగ్గించివేస్తుంది. ఈ పద్ధతికి సరిగా వ్యతిరేకంగా బ్రిటను తన పారిశ్రామిక వస్తువులను కొనేవారినుండి ఆహారపదార్థాలనూ, ముడిపదార్థాలను కొనుక్కోవడానికి ప్రయత్నించుతుంది. దీనినే మరొకవిధంగా చెప్పాలంటే బ్రిటను తాను చేసుకొంటున్న దిగుమతుల ద్వారాను, పరస్పర ఒడంబడికలు చేసుకోవడం ద్వారా తనకు మార్కెట్టుపై వున్న స్థానాన్ని సంఘటితపరచుకొంటున్నది. ఇటీవల యిదేవిధంగా అర్జెంటైనాతో అది చేసుకొన్న పరస్పరమైన ఒడంబడిక అమెరికాకు కోపకారణమైంది. ఈవిధంగా బ్రిటన్ పెద్దగా ధరలు విషయానికి ప్రాధాన్యత నివ్వకుండా పరస్పర ఎగుమతి దిగుమతులకే ప్రాముఖ్యత నిస్తోంది.

ఈరకమైన లాభకరమైన అవకాశాన్ని తీసుకొని బ్రిటన్ తన ఎగుమతులను జయప్రదంగా అధికం చేసుకోగలుగుతోంది. దాని ఫలితంగానే గత రెండు సంవత్సరాల కాలంలో బ్రిటిషు ఎగుమతులు నూటికి 50 చొప్పున పెరిగాయి. ఇదేకాలంలో మార్షల్ ప్లానును అమలు జరుపుతున్నా బ్రిటిషు ధరలకంటే అమెరికా ధరలు ఆకర్షణంతంగా వున్నప్పటికీ, అమెరికా ఎగుమతులు మూడోవంతుకు పడిపోయినాయి. అయినప్పటికీ నేటి ఎగుమతుల వైరుధ్య పోరాటంలో దీర్ఘకాలంలో అమెరికా గుత్త పెట్టుబడిదారులే విజయాన్ని సాధించగలుగుతారు. ఈ సంవత్సర ప్రారంభ మాసాలలో అమెరికా ఎగుమతులు యుద్ధానికి ముందున్న స్థితికంటె రెట్టింపు అయి

నాయి. బ్రిటన్ ఎగుమతులు యుద్ధానికి ముందున్నదానికంటే సగానికి తగ్గాయి. ఇలా వున్నా, సంక్షోభం అధికమవుతున్నకొద్దీ వాల్‌స్ట్రీట్ ధనికవర్గాలు ప్రపంచ మార్కెట్టులో తమ ప్రధాన వైరిని తీవ్రమైన దెబ్బకొట్టాలని వాంఛించుతున్నాయి.

పౌండువిలువను తగ్గించడానికి నేడు జరుగుతున్న ప్లానుల అంతర్యమదే. బ్రిటన్ అనుసరించే పరస్పర ఒడంబడికల విధానం (బైలేటరల్ అగ్రిమెంట్సు) యావత్తూ పౌండుకు ఒక నిర్ణీతమైన మారకపురేటును ఆధారంచేసుకొని నడుస్తోంది. యీ పౌండ్లను నేరుగా డాలర్లలోకి మార్చడానికి వీలులేకుండా ఒడంబడికలలో పొందుపరచబడి వుంటుంది. ఇలా వుండకపోతే బ్రిటన్‌కు ఆహార పదార్థాలనూ ముడి పదార్థాలను ఎగుమతిచేసే దేశాలు తమ ఎగుమతులద్వారా వచ్చిన పౌండ్లను డాలర్లలోకి మార్చుకొని ఇంకా చౌకధరలుండే అప్పుమీద అమ్మే అమెరికాలాంటి దేశాలనుండి తమకు కావలసిన యంత్రపరికరాలనూ, యితర పారిశ్రామిక వస్తువులను కొనుక్కొంటాయి. పౌండువిలువను తగ్గించాలనే డిమాండుతోబాటు పౌండ్లను డాలర్లలోకి మార్చుకొనే అవకాశాన్నికూడా కలుగజేయాలనికూడా అమెరికా గుత్తపెట్టుబడిదారులు కోరుతున్నారు. ఆ విధంగా బ్రిటన్‌కున్న నేటి ఖాతాదారులను తన వైపుకు తిప్పుకోడానికి అమెరికా ప్రయత్నించుతుంది.

అమెరికా ఇప్పటికే మార్షల్‌ప్లాను ద్వారా బ్రిటన్, యితర పశ్చిమయూరప్ రాజ్యాలపై తన ఎగుమతులను రుద్దుతూ, తిరిగి అవి తమవస్తువులను డాలర్ప్రాంతానికి ఎగుమతులుచేసే అవకాశంలేకుండా చేసింది. ఈ విధంగా అది ఒక దారిని మాత్రంవుంచి రెండోదారిని బంద్‌చేసింది. ఇక పశ్చిమయూరప్ దేశాలు తూర్పు యూరప్ దేశాలతో వర్తక సంబంధాలు పెట్టుకోకుండా నానారకాలైన నిర్బంధాలు విధించబడ్డాయి. ఇవన్నీ నానాటికీ ఆర్థికక్లిష్టపరిస్థితులతో సతమతమవుతున్న బ్రిటన్‌కు డాలరు కొరతనుకూడా తెచ్చిపెట్టాయి. దీనిఫలితంగా ఎన్నో ఏండ్లతరబడిగా బ్రిటన్‌కు వుంటూ వచ్చిన మార్కెట్లను అమెరికా దురాక్రమణదారులు స్వాధీనం చేసుకోడానికి బాట సరిచేయబడింది.

పౌండు విలువను తగ్గించి, దానిని డాలర్లలోనికి మార్చేస్థితికి తెస్తే అమెరికా విస్తరణకు ఇంకా ఎక్కువగా సహాయపడుతుంది. బ్రిటన్ వివిధ దేశాలనుండి ఆహార, ముడిపదార్థాలను దిగుమతి చేసుకోవాలనీ, తిరిగి ఆదేశాలకు అవసరమైన పారిశ్రామికవస్తువులను బ్రిటన్‌కు బదులు తాను ఎగుమతిచేసే ఏర్పాటు వుండాలని అమెరికా కోరుతోంది. ఈ ఆశయాన్ని సాధించేందుకు పౌండువిలువ తగ్గడం ఫలితంగా అధికమయ్యే బ్రిటన్ ఎగుమతుల వ్యాపారపోటీని సహితం భరించడానికి కూడా అమెరికా సిద్ధపడింది. అందరికీ సమాన అవకాశాలున్న వర్తక పరిస్థితులలో ఏది ఏమైనా తాను తన సరకులను తక్కువధరలకు అమ్మగలనని, ఆవిధంగా బ్రిటన్ ఎగుమతుల యావత్తు విధానాన్ని దెబ్బగొట్టగలనని అమెరికా తలుస్తోంది. అందుకనే అమెరికా గుత్తపెట్టుబడిదారులు బ్రిటిష్‌పరిశ్రమలపై పోరాటానికి కాలు దువ్వుతున్నారు. అదేకాకుండా బ్రిటిష్ సామ్రాజ్యాన్నుండే అమెరికా

దిగుమతి చేసుకొంటున్న రబ్బరు, తగరం వగైరా ధరలు తగ్గడం అమెరికా గుత్త పెట్టుబడిదారులకే లాభకరం. తమశక్తులలో విశ్వాసం లేని కొన్ని అమెరికా వాణిజ్యవర్గాలు మాత్రమే పౌండు విలువ తగ్గడం మూలంగా అధికమయ్యే బ్రిటిష్ ఎగుమతుల వ్యాపారపోటీని తట్టుకోలేమని భయాన్ని చెందుతున్నాయి.

బ్రిటిష్ కరెన్సీ విలువను తగ్గించడానికి అమెరికా ధనికవర్గం తెస్తున్న వొత్తిడికి మరొక ముఖ్యమైన కారణమేమంటే అది పశ్చిమ యూరప్ పరిశ్రమలన్నింటినీ కారుచౌకధరలకు కొని ఆవిధంగా ఆదేశాలను ఆర్థికంగా బానిసత్వంలో ముంచడానికి సానుకూలపడుతుంది. యురోపియన్ కరెన్సీల విలువ తగ్గడంమూలంగా అమెరికా దోపిడిగాండ్రకు అక్కడ పరిమితిలేని అవకాశాలు లభిస్తాయి.

కాబట్టి స్టర్లింగు విలువను తగ్గించే విషయంలో ఆంగ్లో-అమెరికన్ తగాయిదా యుద్ధానంతరం రెండు రాజ్యాలకూ జనరల్ గా తీవ్రతరమవుతున్న 'వైరుధ్యం యొక్క ప్రతిబింబం మాత్రమే. ఇది ఏదో ఒక కరెన్సీని గురించిన తగాయిదా మాత్రమే కాదు. వివిధ పరస్పర విరుద్ధ ప్రయోజనాలమధ్య వచ్చిన తీవ్రమైన సంఘర్షణ. ఈ సంఘర్షణ ఫలితమే బ్రిటన్ ప్రథమశ్రేణికి చెందిన పారిశ్రామిక రాజ్యంగానూ, ఎగుమతులను అధికంగాగల దేశంగాను నిలబడేటి లేనిదీ తేలుతుంది. ఉభయులమధ్య నేడున్న తగాయిదా "సహకారానికి" నూతన విధానాలనునిర్ణయించుకోడానికి మాత్రమే నని, రెండువైపులా చేసే ప్రయత్నాలు బ్రిటన్ అమెరికాలలో ప్రజాభిప్రాయాన్ని తప్పుత్రోవ పట్టించడానికి మాత్రమే. కాని ఉభయులమధ్య తీవ్రతరమవుతున్న సంఘర్షణ ఆవిధంగా తప్పుగా ప్రచారంచేసి ప్రజలనుమోసపుచ్చే ప్రయత్నాలు ఎలా విఫలమవుతాయో మరొకసారి చూపెడుతున్నాయి.

* * *

నానాటికీ అధికమవుతున్న ఆర్థిక సంక్షోభం ఆంగ్లో - అమెరికన్ వైరుధ్యమనే అగ్నిజ్వాలల్లో ఆజ్యం పోసినట్లయింది. పారిశ్రామిక ఉత్పత్తి తగ్గుదల యింకా ప్రారంభం కాకమునుపే 1948 ఆరంభంలోనే కేపిటలిస్టు దేశాల ఎగుమతులు తగ్గిపోయాయి. దానితో ఆర్థిక పోరాటం మరింత తీవ్రతరమైంది. యిది పౌండువిలువను తగ్గించే సమస్యపై అమెరికన్, బ్రిటిషు గుత్త పెట్టుబడిదారుల మధ్యనున్న సంఘర్షణను మరింత అధికమయ్యేటట్లు చేసింది.

మార్షల్ ప్లానుకు గల ఆర్థికపునాది యావత్తూ కూలిపోతున్నది. అదివరకే తక్కువగావున్న అమెరికాకు బ్రిటను చేసే ఎగుమతులు ఉత్పత్తి పడిపోవడంతోనూ అమెరికా స్వంత మార్కెట్టు కుదించబడటంవల్ల మరింత తగ్గిపోయాయి. ఈ ఎగుమతులు ఇంకా తగ్గిపోతున్నాయి. 1948 లో సగటున నెలకు 5,900,000 పౌన్లకు తగ్గింది. 1949 ఏప్రిల్, మే, జూన్ మాసాలలో వరుసగా 3,300,000, 3600,000, 30,00,000 పౌన్ల చొప్పున వుంటూ వచ్చాయి. యీ విధంగా మార్కెట్టులో బ్రిటిషు సరకులకు స్థానం లేకుండా అమెరికా చేయడాన్ని బట్టి బ్రిటిషు ప్రభుత్వం తాను డాలర్లతో కొనవలసిన వస్తువులను కొనడాన్ని వీలయినంత వరకు "వాయిదా" వేయడానికి నిర్ణయించింది. 1949-50 సంవత్సరానికి డాలర్

ప్రాంతాన్నుండి కొనవలసిన 100,000,000 పౌన్ల విలువగల సరకులను 1/4 వంతును తగ్గించడానికి కూడా నిర్ణయించింది.

ఎంతో బాధతో ముడిపెట్టబడిన మార్షల్ ప్లాను వాణిజ్య సంబంధాలన్నీ ప్రపంచం కళ్ళముందే తుత్తునియలై పోతున్నాయి. వారు డబ్బా వాయించుకొన్నట్లుగా వారిలో వారికి మధ్య వ్యాపార సంబంధాలు అభివృద్ధి కావడానికి బదులు ఆంగ్లో-అమెరికన్ శిబిరంలో నానాటికి వైరుధ్యాలూ, చీలికలూ పెరుగుతున్నాయి. "పశ్చిమ దేశాల ఆర్థిక సహకారం" స్కీము కేపిటలిస్టు వైరుధ్యాల మొదటి దెబ్బలకే తట్టుకోలేక విఫలమైంది.

పరిమితిలేని విస్తరణకు విపరీతమైన ఆశలు పెట్టుకొన్న అమెరికా మార్షలు ప్లాను అధినేతలు నేడు నిస్పృహతో కృంగిపోతున్నారు. "ప్రపంచ ఆర్థిక నిర్మాణానికి" తాము నాయకత్వం వహించగలమని వాల్‌స్ట్రీట్ వర్గాలు కొట్టుకొన్న డంబాలకు ఆధారాలే కనబడకుండా పోయాయి. పౌండు విలువను తగ్గించే సమస్యపై జరుగుతున్న తగాయిదాలు ఇందుకు నిదర్శనం.

మార్షల్‌ప్లానును తమభుజానవేసుకొని ప్రచారంచేసిన లండన్ వర్గాలకుకూడా ఆశాభంగం తప్పలేదు. ఆర్థికశాఖామంత్రి సర్ స్టాఫర్డు క్రిప్సు ప్రకటించినట్లుగా బ్రిటన్ డాలరుకొరత యీ సంవత్సరం మొదటి మూడుమాసాలలో 8200000 పౌన్లుంటే రెండో మూడో మాసాలకు 157000000 పౌన్లకు పెరిగింది. ఇది యిలా వుండగా స్టర్లింగు ప్రాంతంలోని కరెన్సీ రిజర్వులు మార్చి 31 వ తేదీకి 471000000 వుంటే జూన్ 30 వ తేదీకి 406000000 పౌన్లకు దిగజారాయి. పరిస్థితులు యీ విధంగా వుండగా బ్రిటన్ క్షేమానికి సహాయపడే అమెరికా మిత్రులు యీ రోజున బ్రిటన్ పౌండువిలువను తగ్గించేందుకు చేసేప్రయత్నం ఎలాంటి "సహాయ" మంటే ఆత్మహత్య చేసుకొనేవాడిచేతికి నిండా గుండులతోనింపిన రివాల్వరు యివ్వడంలాంటిది. పచ్చి సామ్రాజ్యవాదులైన అమెరికా గుత్తపెట్టుబడిదారులతో సామ్రాజ్యవాద సంబంధాలను ఏర్పరచుకోవడం మూలంగా తన కష్టాలనుండి బయలుపడాలని తాను చేసినప్రయత్నమే బ్రిటన్‌ను యీ స్థితికి తెచ్చింది.

ఇటీవల కన్సర్వేటివ్ పత్రిక "యార్క్‌షైర్ పోస్టు" వ్యాఖ్యానించినట్లుగా ఎగుమతులకంటే దిగుమతులను ఎక్కువ కలిగిన బ్రిటన్‌కు తనకరెన్సీ విలువను తగ్గించుకోవడం అంటే "ప్రమాదకరమైన మందు" తీసుకోవడమన్నమాట. ఈ పత్రిక అందులోనున్న ప్రమాదాన్ని యీ క్రిందివిధంగా వర్ణించింది.

"ఈనాడు పౌండు విలువ దాదాపు నాలుగు డాలర్లు. దాని విలువను అధికారరీత్యా మూడు డాలర్లకు తగ్గించారనుకుందాం. అప్పుడు బ్రిటిష్ వస్తువులను కొనే ప్రతి అమెరికన్ దేశస్థుడూ యిదివరకు నాలుగు డాలర్లు చెల్లించవలసింది. ఇప్పుడు మూడు డాలర్లకంటే ఎక్కువ చెల్లించ నవసరంలేదు. అందు

వలన అమెరికాలో వస్తువులను అమ్మడం సహజంగా తేలికవుతుంది. కాని అందులోనే ప్రమాదాలున్నాయి. వెను వెంటనే సంభవించే ఒక ప్రమాదమేమంటే దిగుమతులకు ఎక్కువ చెల్లించవలసి వస్తుంది. నాలుగు డాలర్లు ఖరీదుతో పంపించేవస్తువులకు యీనాడు ఒక పౌండు మాత్రమే ఖర్చు అవుతుంది. కాని పైన ఉదహరించినట్లుగా మారకపు రేటు తగ్గించిన తరువాత ఆ వస్తువులే 26 షిల్లింగుల 8 పెన్సు లవుతుంది. కాబట్టి అమ్మకం అధికంగా వుంటుందనే అనుకూల విషయాన్ని మనం కొనే వస్తువులకు అధికధరలు చెల్లించవలసి వస్తుందనే ప్రతికూల విషయంతో తూగించవలసి వుంటుంది."

దీనినుండి "యార్క్‌షైర్‌పోస్టు" పత్రిక యీ క్రింది సారాంశాన్ని తెలుస్తున్నది:

"కరెన్సీ మారకపువిలువను తగ్గించినతరువాత మనం చేసుకొనేదిగుమతులఖర్చు హెచ్చుతుంది. వాటితో తయారుచేసి మనం ఎగుమతులు చేయవలసిన వస్తువుల వుత్పత్తి ఖరీదు అధిక మవుతుంది. అందువలన యింత విపరీతమైన ధరలుగల వస్తువులను విదేశాలలో అమ్మడం మరీ కష్టమవుతుంది. ఈ చిక్కును అధిగమించేందుకు మళ్లీ కరెన్సీ విలువను తగ్గించవలసి వస్తుంది. యిది చాలా ప్రమాదకరమైన పంపు. యీ మందును సేవించినవారు నాశనంకాక తప్పదు."

కాబట్టి కరెన్సీవిలువను తగ్గించడం వలన వారిసమస్యలు పరిష్కారం కావనే విషయం బ్రిటిషు కేపిటలిస్టులకు స్పష్టంగా తెలుసు. 1929-38 సంవత్సరాలలోవచ్చిన ఆర్థిక సంక్షోభకాలంలో ఇతరదేశాలనుండి బ్రిటన్ దిగుమతి చేసుకొన్న ముడిపదార్థాల ధరలు తన ఎగుమతుల ధరలకంటే చాలవరకు తగ్గులోనే వున్నాయనే విషయాన్ని జ్ఞాపకం వుంచుకోవాలి. తమ స్టర్లింగు మారకపురేటును తగ్గించుకోవడం ద్వారా బ్రిటిషు గుత్త పెట్టుబడిదారీ వర్గాలు లాభంపొందాయి. కాని ఈనాటి పరిస్థితి అదికాదు. ఎందువల్లనంటే ముడిపదార్థాల ధరల పెరుగుదల ఎగుమతి చేయబడే బ్రిటిషు వస్తువుల ధరల పెరుగుదలకంటే అధికం.

పౌండు విలువను తగ్గించే సమస్యలో ఆంగ్లో-అమెరికన్ కీచులాట అమెరికా ఆర్థిక శాఖ కార్యదర్శి సిన్‌డర్ యూరప్‌కు వచ్చినప్పుడు కొంత మందంగా నడిచింది. ఆర్థిక సంప్రతింపులలో సెప్టెంబరు మాసంలో వాషింగ్‌టన్‌లో జరగాలని నిర్ణయించబడింది. ప్రస్తుత పోకడలను

బట్టి చూస్తే అమెరికా అప్పుడు తన అంతిమదాడి చేయవచ్చు.

బ్రిటిషు పాలకవర్గాలలోనే పౌండు భవిష్యత్తు విషయంలో అభిప్రాయ భేధాలున్నాయని పత్రికలు ప్రకటించడం యీ సందర్భంలో గమనించతగ్గవిషయం. సినడర్ వచ్చి వెళ్ళిపోయిన తరువాత విశ్రాంతికని సెలవు తీసుకొన్న క్రిప్సు పౌండు విలువను తగ్గించడాన్ని వ్యతరేకిస్తున్నట్లూ, అమెరికా కోర్కెలను అంగీకరంచడం సాధ్యపడుతుందని బెవిన్ తలపోస్తున్నట్లూ పత్రికలు వ్రాస్తున్నాయి. అమెరికా సామ్రాజ్యవాదానికి లొంగి, దాసోహమనే పాలసీ తన అంతిమ లక్ష్యాన్ని చేరుకొంటుందిగాని మధ్యలో ఆగడమంటూ వుండదనే విషయం స్పష్టమే.

* * *

ఉత్పత్తి తగ్గుతూ విదేశవ్యాపారం నానాటికి మందగిస్తున్న పెట్టుబడిదారీ ప్రపంచ పరిస్థితులకు ప్రత్యక్ష విరుద్ధంగా ఇటు సోవియట్ యూనియన్ నూతన ప్రజాతంత్ర రాజ్యాలలో క్రమేణా ఉత్పత్తి హెచ్చుతోంది. వారి మధ్య వాణిజ్య సంబంధ బాంధవ్యాలు రోజు రోజుకూ ఇంకా ఎక్కువగాబలపడుతూ, మరింత వృద్ధి పొందుతున్నాయి. అటు అమెరికాకూ పశ్చిమ యూరప్‌లోని మార్షల్ దేశాలకు మధ్య వర్తకం త్వరిత గతిని తగ్గిపోతోంది. పశ్చిమ యూరప్ రాజ్యాలలోనే - వాటిలో వాటి మధ్య వ్యాపారం 1948 లో యుద్ధానికి పూర్వమున్న వ్యాపారంతో పోల్చిచూస్తే నాలుగింట మూడు వంతులవు (72%) తగ్గిపోయింది. దీనికి వ్యతిరేకంగా 1948 లో నూతన ప్రజాతంత్ర రాజ్యాల మధ్య వ్యాపారం, వాటితో సోవియట్ యూనియన్ వ్యాపారం 1938 యుద్ధానికి పూర్వమున్న వ్యాపారంతో పోల్చి చూస్తే, దాదాపు మూడు రెట్లు (288%) వృద్ధిపొందింది.

పశ్చిమయూరప్ రాజ్యాల పాలకుల అభివృద్ధి నిరోధక పాలసీ ఎంతటి దివాళాకోరు తినానికి దారితీస్తున్నదో యీ లెక్కలే చూపెడుతున్నాయి. వారి తప్పువలననే 1948లో పశ్చిమ తూర్పు యూరప్‌లమధ్య వ్యాపారం యుద్ధానికి పూర్వపుస్థితితో పోల్చిచూస్తే సగానికి సగం(42%)తగ్గిపోయింది. తమ సంకుచిత స్వార్థపూరితమైన వర్గదృష్టిఅనే గ్రుడ్డితనంలో యీ పాలకులు అమెరికా వొత్తిడికి లొంగిపోయి పశ్చిమ, తూర్పు యూరప్‌ల మధ్య మామూలు వ్యాపార సంబంధాలను నెలకొల్పకుండా నాశనం చేశారు. కాని వారు యీ పాలసీని అనుసరించడం మూలంగా తమ దేశాలకు అంతులేని హానిని వాటిల్లజేశారు. వాటిల్లజేస్తున్నారు.

— ఎ. కొట్లియారోవ్

“[illegible]నిర్మాణకృషి లేకుండా అంతర్యుద్ధం కొనసాగించడం అసంభవం.”

స్టాలిన్

(ప్రోబ్లెమ్స్ ఆఫ్ లెనినిజం పేజి 136)





# నూతన ప్రజాతంత్రం కోసం సోషలిజం కోసం పోరాటం

(వ్యూహం : ఎత్తుగడలకూ సంబంధించిన కొన్ని సమస్యలు)

వెల. 1–4–0.

ప్రచురణ : విజ్ఞానసాహిత్యవనం, విజయవాడ – 2.

ఇది ఆంధ్ర సెక్రెటేరియట్ వ్రాసిన డాక్యుమెంట్లపై 'కమ్యూనిస్టు' పత్రికా సంపాదకవర్గం చేసిన విమర్శ. కలకత్తాలో జరిగిన ద్వితీయపార్టీకాంగ్రెసు తదనంతరం పార్టీలో ఇంకా సంస్కరణ వాద చ్ఛాయలు ఏయే రూపంలో ఉన్నయో ఇందులో సాంగోపాంగంగా చర్చింపబడింది. నేటి రాజకీయార్థిక పరిస్థితులను మార్క్సిస్టు దృష్టికోణంలో సమగ్రంగా పరిశీలించడం జరిగింది. ఆర్థిక సంక్షోభం ఫలితంగా కలకత్తా కాంగ్రెస్ తర్వాత గడచిన ఎనిమిదిమాసాల్లో బ్రహ్మాండంగా విజృంభించిన కార్మికుల, రైతుల, విద్యార్థుల పోరాటాలను అణచివేయడానికి ప్రభుత్వం ఎంతటి అమానుషమైన నిర్బంధవిధానాన్ని ఉపయోగించింది? దీనినుంచి నేర్చుకోవలసిన గుణపాఠా లేమిటి? పారిశ్రామిక రంగంలో, వ్యవసాయికరంగంలో ప్రభుత్వం అవలంబిస్తూ ఉన్న విధాన మేమిటి? ప్రజల కర్తవ్య మేమిటి? కాశ్మీరు, హైదరాబాద సమస్యల అంతరార్థ మేమిటి? భారత బూర్జువావర్గం ఇంకా సామ్రాజ్యవాదులతోనే ముడిబెట్టుకుని ఉండడానికి కారణ మేమిటి? సంస్కరణవిధానాన్ని అనుసరించడంవల్ల ఎలాంటి ఫలితాలు గలిగాయి? మార్క్సిస్టు అధ్యయనాన్ని నిరుత్సాహ పరచడంవల్ల కలిగిన ఫలితాలేమిటి? ధనికరైతుల భావాలకు కూడా ఆంధ్రలోపార్టీలోబడిపోవడంఎందు

వల్ల జరిగింది? పెటీబూర్జువా ఆధిక్యతతో పార్టీని నిర్మించడంవల్ల కలిగిన ఫలితాలేమిటి? మితవాద సంస్కరణ పోకడ అతివాద రూపంలో ఎలా ప్రస్ఫుటమవుతుంది? నిర్మాణసమస్య పై ఎలాంటి లోపం జరిగింది? నేటి పరిస్థితుల్లో వ్యూహం ఎత్తుగడలేమిటి? ఎలాంటి పరిస్థితుల్లో వ్యూహం మారుతుంది? ఎత్తుగడల పంథా ఏమిటి? పోరాటపద్ధతులెట్టివి? శ్రామికవర్గ నిర్మాణపద్ధతులేమిటి? ఒక సెక్రెటేరియట్ సభ్యుని తప్పులను దిద్దబోయి స్వయంగా సెక్రెటేరియట్టే ఏమేమి తప్పులు చేసింది? శ్రామిక నియంతృత్వం అంటే "సిద్ధాంత, కార్యక్రమాల నాయకత్వం......" అని నిర్వచించడం సరియైన దేనా? ఆంధ్ర సెక్రెటేరియట్ చేసినట్లుగా నాయకత్వానికీ నియంతృత్వానికీ మధ్యవిభేదాన్ని చూపడం సక్రమమేనా? "పరిస్థితుల్లో ఎట్టి మార్పు" రాలేదా? నూతన ప్రజాతంత్రం అంటే అనేక వర్గాల (బూర్జువావర్గంతో సహా) నియంతృత్వంఅని మా-సె-టుంగ్ చేసిన నిర్వచనం సరియైనదేనా? నూతన ప్రభుత్వాన్ని రక్షించడానికి మొత్తం బూర్జువావర్గం అంతా ఎందువల్ల పూనుకుంటుంది? "ఫ్యూడల్ శోకలులేని" ధనిక రైతును 'తటస్థునిగా' చేయడం సాధ్యమవుతుందా? చైనాప్రజలు ఇంతటి దీర్ఘకాలయుద్ధాన్ని ఎందువల్ల కొనసాగించవలసి వచ్చింది? మొదలైన విషయాలన్నీ ఈ గ్రంథంలో సాకల్యంగా చర్చించబడ్డాయి. మార్క్సిస్టు విజ్ఞానాన్ని పెంపొందించుకోడానికి ఈ విమర్శ ఎంతో ఉపయోగపడుతుంది. ఇది రాజకీయజిజ్ఞాసగల వారందరూ తప్పక చదవవలసిన గ్రంథం.

— రెడ్డి

*

# నూతన చైనా: నూతన ప్రపంచం

రచన:
ఆర్థర్ క్లైగ్.
వెల. 1-0-0.
ప్రచురణ: విజ్ఞానసాహిత్యవనం, విజయవాడ 2.

ఈ గ్రంథ రచయిత ఆర్థర్ క్లైగ్ 1937నుంచి 1939వరకు బ్రిటన్‌లో చైనా సహాయోద్యమ కమిటీకి ఆర్గనైజరుగా పనిచేశాడు. తర్వాత 1941నుంచి 1947 వరకు "వరల్డ్"

న్యూస్ అండ్ వ్యూస్" అనే సుప్రసిద్ధ మార్క్సిస్టు వార పత్రికకు సంపాదకుడుగా ఉన్నాడు.

ఈ గ్రంథాన్ని పరిచయం చేస్తూ చైనా కార్మిక నాయకుడు ల్యూ-నింగ్-యీ (ప్రపంచ కార్మిక సమాఖ్య ఉపాధ్యక్షుడు) ఇలా వ్రాస్తున్నాడు.

"దేశ వ్యాపితమైన సంపూర్ణ విజయాన్ని సాధించే శుభఘడియల్లో 45 కోట్ల చైనా ప్రజానీకం సంతోషసాగరంలో ఓలలాడుతూ ఉంది. ఇప్పటికప్పుడే 20 కోట్ల మంది ప్రజలు నూతన ప్రజాతంత్రం అందిస్తూఉన్న స్వేచ్ఛా ఫలాన్ని అనుభవిస్తున్నారు."

"అవును, నూతన చైనా అంటే నవ్య ప్రపంచం. చూపులకు కనపడ్డంతడాబుగా వాల్ స్ట్రీటుకు వాస్తవంగా అంత సత్తువలేదు. అది చైనాలో పరాజితమైంది. ప్రతిచోటా ప్రతి విషయంలో అది పరాజయం పొందడం తథ్యం. ఈ పోరాటంలోనుంచి ఒక నవ్య ప్రపంచం తేజోవంతమైన ప్రపంచం ఉద్భవిస్తోంది."

సుమారు 100 పేజీలలో నేటి చైనా వాస్తవిక పరిస్థితి రచయిత చక్కగా కండ్లకుగట్టినట్లు చిత్రించాడు.

"నియంతృత్వానికి, డాలర్ పరిపాలనకూ చైనాను బలి జంతువుగా చేయడానికి యుద్ధం" ప్రారంభమైన దగ్గరనుంచి విప్లవం విజయంపొందే వరకు మధ్య జరిగిన చరిత్ర అంతా ఇందులో క్లుప్తంగా ఇవ్వబడింది.

అయితే చైనా ప్రజల ఒక్కరిలోనే నూతన ఆశను రేకెత్తించడం లేదు. యావత్తు ఆసియాప్రజల్లోను ఆ ఆశప్రకాశిస్తోంది" కనుక ఈ పుస్తకం ప్రతివారూ చదవతగ్గది. అనువాదం సాఫీగా నడిచింది. కాని అచ్చుతప్పులు చాలా ఎక్కువగా దొర్లాయి. ప్రకాశకులీవిషయంలో ఇంకా ఎక్కువ శ్రద్ధవహిస్తారని ఆశిస్తున్నాం. — రెడ్డి

పై రెండు పుస్తకాలకు :—
ఆంధ్ర బుక్ హౌస్,
జాలయ్యామార్కెట్, గుంటూరు.
అండ్ లీలాబుక్ డిపో,
విజయవాడ-2

*

# ఇటలీ కథలు

రచన: మాక్సింగోర్కీ.
అనువాదం: ప్రయాగ వెల: రు. 1
ప్రచురణ: త్రిలింగ పబ్లిషింగ్ కంపెనీ, విజయవాడ 2.
ప్రతులకు: లీలా బుక్ డిపో,
విజయవాడ 2.

మానవజీవితానికి, పురోగమనానికి కళారూపం కల్పించిన మహాశిల్పి మాక్సింగోర్కీ ఇటలీ లో ఉన్నప్పుడు ఇటలీ ప్రజలజీవితాన్ని గాథల్ని పదికథల్లో చిత్రించాడు. ఆకథాసంపుటికి అనువాదమే ఈ ఇటలీకథలు.

నేపుల్స్‌పట్టణంలో సమ్మెచేసి "పాదరసంలా ప్రవహించేట్రాం కండక్టర్ల, డ్రైవర్ల జనసమూహా" లూ; "ఊరేగింపుగా బార్లు తీర్చి చెట్టపట్టాలు పట్టుకొని" వస్తూన్న పార్మాకార్మికులబిడ్డలూ; "చుట్టూ మంచుకిరీటాలు పెట్టుకున్న ఉన్నత పర్వతాలూ; ఆకొండలనుంచి నీటి అంచువరకు వ్యాపించి వంపులు వంపులుగాదిగివస్తున్నమానవులూ; "అజేయ జగజ్జీవితానికి అనంత ప్రాణవాహినులైన మాతృదేవత"లూ, "వేద నామయమైన హృదయంలో సాహసం అసహజం కాని" వీరమాతలూ; పల్లెవాళ్లూ; పల్లెటిప్రజలూ; రాళ్లుకొట్టేవాళ్లూ; భవిష్యత్కవులూ ...అంతా...సజీవమైన ఇటలీ ఈ కథల్లో సాక్షాత్కరిస్తుంది.

అనువాదం చాలా సాఫీగా నడిచింది.

— రెడి

# రక్తవాహిని

రచన:
మాగ్జింగోర్కీ.
అనువాదం:
నిడమర్తి ఉమారాజేశ్వరరావు.
వెల. 0-10-0.
ప్రగతి ప్రచురణాలయం-నిడమర్రు

ఈ పుస్తకంలో గోర్కీ రచించిన 'రక్తవాహిని' అనే ఒక పెద్ద కథ కెప్లర్, జ్లటోగోరోవా లు రచించిన 'లెనిన్' అనే ఒక నాటిక ఉన్నాయి.

# ప్రకటన

జనత పాత కాపీలకొరకు చాలామంది వ్రాస్తున్నారు. అందుచేత మావద్దఉన్న కాపీలను చదువరులకు అందజేయుట కొరకై బైండ్లుచేయించి వుంచాము. కావలసినవారు వెంటనే డబ్బుపంపపండి.

వివరాలు : 5 నుండి 10 సంచినవరకు
11 ,, 16 ,,
17 ,, 24 ,,
యిందులో నెం. 19 సంచికలేదు.
బైండు 1 కి రు 4-0-0 లు
పోస్టేజి 0-8-0

ఏజంట్లకు

మీవద్దనైనా నెం. 19 జనత సంచికలు ఉంటే వెంటనే మాకుపంప గోరుతాము.

మేనేజరు
జనత
గవర్నరుపేట - విజయవాడ 2



నేటి ప్రపంచ విప్లవ శక్తులను గురించీ, సాంఘికాభివృద్ధికి సంబంధించిన శాస్త్రీయ సూత్రాలను గురించీ, ఉద్యమాలలో ప్రత్యక్షంగా పాల్గొన్న అనుభవంతో వ్రాసే విశ్వవిఖ్యాతమార్క్సిస్టుల రచనలను అనేక ప్రత్యేక పత్రికల నుండి ఏరి పక్షం పక్షం జనత ప్రచురిస్తోంది.

గ్రంథాలయాల్లోనూ, వ్యక్తుల స్వంత లైబ్రరీల్లోనూ, ప్రజాసంస్థల కార్యాలయాల్లోనూ 'జనత' పత్రిక సంచిక లన్నింటినీ జాగ్రత్త చేసుకునేందుకు చాలామంది ప్రయత్నిస్తూ ఉన్నారు. వెనకటి సంచికలకోసం — వాటిలో ఉండే వ్యాసాల వివరాలను తెలియజేయవలసిందని మా కార్యాలయానికి వ్రాస్తూఉన్నారు. కాబట్టి ఫైల్సులోకి సంచికలు కావలసినవారు వెంటనే ఆర్డర్లు పంపించవలసిందని కోరుతున్నాం.

1, 3, 4, 19 సంచికలు మినహా మిగతా సంచికలన్నీ దొరుకుతాయి.

1 నుంచి 10వ సంచిక వరకు వచ్చిన వ్యాసాలను 11 వ సంచికలో ఇచ్చాం. పాఠకుల సౌకర్యార్థం ఇప్పుడు 11 వ సంచిక నుంచి ఈ సంచిక వరకూ వచ్చిన వ్యాసాలను ఈ దిగువ ఇస్తున్నాం.

మేనేజరు **జనత**

## వివిధ సంచికలలోని వ్యాసాలు

### సంచిక 11 15-3-49

5. ప్రజాస్వామిక ప్రజాతంత్రం
— యమ్. రకోసి
6. సామ్రాజ్యయుద్ధ ప్లానులు
— పామిదత్తు
7. కామ్రేడ్ మోసెటుంగ్

## సంచిక 16 1-6-49

1. శాంతి సంస్కృతుల సంరక్షణ
2. మార్క్సిస్టు సిద్ధాంతం : వర్గాలూ, వర్గ పోరాటాలు
— ఫె. పెడోసెయేవ్
3. కళావేత్తలారా మీరేవైపు ?
— గోర్కీ
4. ఆసియా ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్—పెట్టుబడిదారుల పెంపుడు బిడ్డ
— కె. ఇవనెంకో
5. ప్రపంచ శాంతి మహాసభ విశేషాలు

## సంచిక 17 15-6-49

1. కేంద్ర ప్రభుత్వబడ్జెట్‌పరిశీలన
2. షాంగ్‌హై విముక్తి
3. శ్రమజీవుల శ్రేయస్సే అభ్యుదయ రచయితల పరమావధి
4. ప్రపంచ శాంతి మహాసభలో చైనా ప్రజావాణి
5. భారతదేశ భాష సమస్య
— రామబిలాసశర్మ
6. ఇండియాలో బ్రిటిష్ సామ్రాజ్యవాదులవన్నాగాలు
— ఇ. ఝుకోవ్
7. చైనా ప్రజాసైన్య నిర్మాత జనరల్ ఛూటే

## సంచిక 18 (1—7—49)

1. యుద్ధం అనివార్యమా ?
—గెర్‌హర్ట్ ఈస్లర్
2. భారతదేశచరిత్ర : సమకాలీన అధ్యయనరీతులు
—డాంగే
3. బర్మా విముక్తి పోరాటంలో నూతనాధ్యాయం.
4. ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాల సాంఘిక రాజ్యాంగ నిర్మాణం,
—యన్. ఫర్బెరోవ్
5. సోవియట్‌లో భారతీయ విజ్ఞాన వికాసం
—మంగల్ కిశోర్ పాండే

## సంచిక 19 (15-7-49)

1. శాస్త్రీయ కమ్యూనిజానికి ప్రమాణగ్రంథం "లెనినిజం"
2. సోవియట్ ప్రజాతంత్రం : బూర్జువా ప్రజాతంత్రం.
—యమ్. రాగిన్‌స్కీ
3. అంతర్జాతీయవాదం : జాతీయ వాదం.
4. సోషలిస్టుపార్టీ
5. మార్క్సిస్టు పార్టీనిర్మాణం — సాహిత్యం.
— లెనిన్

6. యు. పి. జమీందారీ రద్దు రిపోర్టు— మార్క్సిస్టు పరిశీలన

## సంచిక 20 (1-8-49)

1. యుద్ధప్రమాదానికి వ్యతిరేకంగా సాగించే పోరాటం.
— "కమ్యూనిస్టు" సంపాదకవర్గం
2. కూలీలపై పెట్టుబడిదారుల దాడి.
—సి. కె. చౌదరి
3. వ్యవసాయ సమస్యపై కామ్రేడ్ లెనిన్
(వ్యావసాయిక సమస్యపై థీసిస్)
4. నూతన ప్రజాతంత్రం దాని రాజకీయ పునాదులు
—తియోహారీ జార్జెస్క్యూ

## సంచిక 21 15-8-49

1. నూతన ప్రజాతంత్ర నియంతృత్వం
—మా-సి-టుంగ్
2. సామ్రాజ్యవాదంలో పరస్పర వైరుధ్యాలు
—పామిదత్తు
3. సిద్ధాంతం
—స్టాలిన్
4. అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ - 23 వ సమావేశం

## సంచిక 22 1—9—49

1. స్టాలిన్ సిద్ధాంతరీత్యా మన వ్యూహం
2. వార్గా అభిప్రాయాలపై విమర్శ
—కె. వి. ఓస్ట్రోవిటియనోవ్
3. సంస్కరణవాద పోకడలు— వార్గా ఆత్మవిమర్శ
4. లేబర్ పార్టీల అభివృద్ధినిరోధక పాలసీ
—ఎ. మిలీకోవ్‌స్కీ
5. మితవాద సోషలిస్టులు: కార్మికోద్యమ విచ్ఛిన్నకులు
—కూసినిన్

## సంచిక 23 (15-9-49)

1. న్యాయమైన రోజుపనికి న్యాయమైన రోజుకూలి
— ఫ్రెడరిక్ ఎంగిల్స్
2 కమ్యూనిస్టులూ ఆర్థిక సంక్షోభం.
— పామిదత్తు
3. విదేశాంగ మంత్రుల సమావేశం దాని ఫలితాలు
—ఎ. సొకోలోవ్
4. వ్యూహం: ఎత్తుగడలు
—స్టాలిన్
5. సో. యూ. క. పార్టీ నిర్మాణ సూత్రాలు
—జి. బ్రోవర్‌స్కీ

## ఏజంట్లకు

మీకుకావలసిన పత్రికలకు డబ్బు ముందుగా పంపుతూ యుండాలి. ఎన్నిపత్రికలు కావాలో అన్నిరూపాయలు డిపాజిటుగా పంపాలి. డబ్బు లేనిదే పత్రికలు పంపబడవు. ఎన్నిపత్రికలు కావలసినది ప్రతినెలా 6 తేదీన, 20 తేదీన తెలుపాలి అదనం కాపీలు కావలసిన ఏజంట్లు ఎన్నికాపీలు కావాలో అన్ని రూపాయలు డిపాజిటు పంపాలి.

మేనేజరు

**జనత**

Regd No. 5296 JANA[illegible]A, A Telugu Marxist Fortnightly



# INDIA TODAY

BY
**Rajani Palme Dutt**

(Second Revised Indian Edition)

Standered Ed.
Rs. **6**/-

Library Ed.
Rs. **12**/-

THE Third Revis[illegible] (2nd Indian Edition.) of this world famous book which was in big demand every where is now out on the market. It has been revised to satisfy the needs of the changed conditions of today after 15th August, when we are supposed to have gone free.

INDIA TODAY by RAJANI PALME DUTT, is a fundamental, Scientific study from a Marxist point of view. It is not a dry academic book but a passionate indictment. With clear examples, it exposes the pillaging imperialist policy of the British colonists and the anti-popular, reactionary activities of their various agents in India, from the first days of the Penetration of British Capital in that country down to the present time ...

INDIA TODAY is a valuable contribution to Marxist Literature on India. This is a clear, fighting, militant book, exposing imperialist reaction and colonial repression.

— YOUNG BOLSHEVIK,
January, 1949



*BOOK YOUR ORDERS IMMEDIATELY :*

*Postage Extra*

**PEOPLE'S PUBLISHING HOUSE Ltd ,**

**190-B Khetwadi Main Road, BOMBA[illegible]**

Edited, Printed & Published by
G. Venkateswara Rao Kottapet, Guntur, Printed at Kavitilaka Press, Vijayawa[illegible]



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA134M124 |
| పుస్తకం పేరు | జనత |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Navya |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |